యేగా! కాని యెన్ని లక్షలున్నా నిర్లక్ష్యంగా యిస్తానా నేను! కాని ఆ ప్రేమ చూపడం అంతా డబ్బుకోసం అనేనా? అంత మోసపోయి నందుకు నామీద నాకే అసహ్యం వేసింది. యింటికి వెళ్ళడమెట్లా గోపా లయ్యర్ని అప్పు అడగాలా!

మధ్యాహ్నం కోర్టుకి వెళ్తూ జేబులో చెయ్యిపెడితే పర్సు ఎక్కడిది? దొంగ రాత్రి యెప్పుడో పెట్టింది తెరిచాను! దాంట్లోంచి యిన్ని జాజి పువ్వులు రాలాయి రూపాయలకి బదులు! జాజిపువ్వులు నూటయిరవై మూడు రూపాయల ఖరీదా? లోపల యింక యేమో వున్నాయి! రూపాయలన్నీ వున్నాయి పైగా ఒక వుంగరం! ఆ రుక్మిణిమీద పడ్డ అనుమానానికి నన్ను నేను తన్నుకోవాలనిపించింది. ఇంతకీ సమస్య యేమీ అంతం కాలేదు ఈ సంగతేదో తెలుసుకున్నదాకా వుండలేను రుక్మిణిని రాత్రి ప్రశ్నిద్దామంటే నోరు రాలేదు కొంచెంగా మొగలుపెట్టినప్పటిల్లా నైదిమలతో, తాంబూలం వాసనలతో అడ్డంపెట్టింది శంకర్రావుని పట్టుకుని అడిగాను. జరిగినదంతా ముందు నాదగ్గిర్నించి లాగాడు అతనూ పోలీసువాడయ్యేను

"తెలీటంలా! గోపాలయ్యరు ముసలివాడు ఎవరన్నా పెద్ద మనుషులొస్తే భార్యని పంపుతాడు వాళ్ళ గదిలోకి"

"ఎందుకు?"

"ఏం చేస్తాడు?"

"మరెందుకు పెళ్ళిచేసుకున్నాడు?"

"ఏమో రే తల్లిబాధో పడలేకపోయి వుంటాడు."

"వెధవ"

"లేదు నా కతన్ని చూస్తే చాలా గౌరవంగా వుంది"

"అవును భార్య అవమానం గుర్తించే భర్తని వేలెత్తిచూపు"

"సరేలే ఆ భవానీసింగ్"

"యింకేముందీ! యింకెవరూ దొరక్కపోతే, పదింటులప్పుడు 'భవానిసింగ్ అమ్మగారికి అవసరం వచ్చాడు' అంటాడు. అందుకే నే ఎవరు వొచ్చినా కనుక్కోక, ఆ జవాబుగాడు."

# అవసరంలేని ఆపరేషన్

ఆ బాణంగా ఆడావిడి యేమిటి?"

"టీపార్టీ."

"ఎవరికి?"

"యీ వూరు ఆడవాళ్ళకి ఒకరికి గిలీ అయింది."

"యింతే లడాయీనా?"

'యీ ప్రాంతంలో ఆమెని చూస్తే అత్యంత అభిమానం."

"యెందుకో?"

"ఏడేళ్ళలోనూ వాళ్ళవి పది వేల రూపాయలు బ్యాంకుల్లో వేసుకుంది. అందుకని"

"అంత తెలివి లేదా?"

"లేనేమో! మొదటి సంవత్సరం ఆమె మొహం చూసినవాడు లేడు. కాని ఆ జూలైలో గావును ఒక విచిత్రమైన కేసు కుదిర్చింది. దాంతో ఆమె ప్రథమ శ్రేణీయంగా వెలిగింది, యీ నాలుగేళ్లూ."

"యేం కేసేమిటి?"

"అదే తమాషా, అందులో యీమె ప్రయోజకత్వ మేమీ లేదు. కీర్తి మాత్రం యీమెకి దక్కింది. వాళ్లు మాకు బంధువులే. చెప్పనా? ఆమెకి ముప్ఫైయేళ్లు—"

"డాక్టరుకా?"

"కాదు. మా బంధువురాలొకామెకి. ఆమెకి పిల్లలు లేరు. పిల్లలు లేకపోతే ఒకొకడ మెందుక నే మనోవ్యాధి పట్టుకుందామెకి. యింక బిడ్డల కోసం వాళ్లుపడ్డ శ్రమా, చేసిన ప్రయత్నాలూ యిన్నన్ని కాదు. యెన్ని మందులో, యెన్ని యాత్రలో, యెన్ని విధాలైన ప్రదక్షిణాలో, యెంత మంది బైరాగులకీ, సన్యాసులకీ బహుమతులో! యేమీ లాభంలేక, ఏకు త్తి రోజూ ప్రతివారితో తన కథ చెప్పుకుని యేడుస్తో పడివుంది. చిన్నదాని వింకా నీకింత తొందరేమిటి, నిర్భాగ్యం యేమిటంటే వినదు. చివరకి ఒక పిల్లాణ్ణి తెచ్చి పెంచుకుంటే, వాడు యీమె ముద్దులు భరించలేక పారిపోయి

నాడు. తరవాత చెన్నపట్నంనుంచి పెద్ద బొమ్మనొకదాన్ని తెచ్చుకుంది. ఆ బొమ్మకి పాలిచ్చీ, ముద్దాడీ, నీళ్ళుపోసీ చొక్కాలు తొడిగీ, అది చేతులూ కాళ్ళాడించాలనీ, యేడవాలనీ, మాట్లాడాలనీ, ఆమెచేసే ప్రయత్నం, చూస్తే అందరికీ అమితమైన జాలి కలిగేది. మా బంధువుల్లో పిల్లలులేని దరిద్రులెవరూ లేరు. కనుక యీమె సిగ్గుపడి, పిల్లలులేనిపాపం చేసినట్లు యే కార్యాలకీ యెక్కడకీ వెళ్ళడం మానేసింది. యెవరు తన యింటికి వచ్చినా, వాళ్లు తనని హేళనచేస్తున్నారే అనుకుంది. పిల్లలకోసం యీమె చెయ్యడానికి నిరాకరించే పనివుందా అనిపించేది. యింతలో ఆ వూళ్లోకి స్వాములాగ్లమీది గొప్పస్వాములవారు వొచ్చారు. గొడ్రాళ్ళకి పిల్లలు పుట్టించడంలో ఆయన బహునేర్పరి. గుంపులు గుంపులుగా ఆడ వాళ్ళాయన్ని దర్శించి కృతార్థులౌతున్నారు. ఒక్క వితంతువులు మాత్రం, ఆయన గాలి తగిలితే, తమకే వుపద్రవం కలుగుతుందో అని దూరాన తప్పుకొంటున్నారు. సరే, యీమె ఆయన దర్శనానికి వెళ్ళింది. పదిహేను రోజులలో గర్భిణీ చిన్నాలు కనపడ్డాయి, వేవిళ్ళు మొదలైన సంగతులన్నీ సక్రమంగా జరిగాయి. యింకె వుత్సనాలేమిటి? నూడిదలూ, వొచ్చే బంధువులూ, పోయే బంధువులూ, పదినెలలూ ఒకటే గొడవగా గడిచింది. పదినెలలూ దాటాయి; కనలేదు. సంవత్సరమయింది కడుపు అట్లానేవుంది. వాళ్ళకి భయమేసి యీ డాక్టరుగగ్గిరికి తీసుకొచ్చి చూపారు. ఆమె పరీక్షచేసి అది కడుపుకాదని రూఢిగాచెప్పింది. ఆమాట వినగానే పాపం యీపిల్ల మూర్ఛపోయింది. బంధువులంతా గొల్లుమని యేడ్చారు. వారంరోజులు మందిచ్చేటప్పటికల్లా పొట్ట కాస్త కరిగిపోయింది. ఇట్లా పది నెల్ల గర్భిణీని, వారంరోజుల్లో మాయంచెయ్య శక్తిగలిగిన డాక్టరు, తిరిగి దాన్ని నిజంగా రప్పించలేదా అనే గట్టి విశ్వాసం వాళ్ళకు కుదిరింది. ఆమె తనకి చాతకాదు, బొమ్మన్నా వాళ్ళు కదలలేదు. ఒకరోజురాత్రి యీమె పోయి డాక్టరు కాళ్ళమీదపడి బతిమాలుకుని తనకి సంతానం కలిగితే పది హేనువందల కాసులపేరు యిచ్చేస్తానంది.

ఈ డాక్టరు భర్త బి. య్యే. పాసై ఎండాకాలపు శెలవలకి యీమె యింటో వున్నాడు. ఒకరోజు భార్య ఆస్పత్రికి వెళ్ళినప్పుడు యీ

అమ్మాయివొస్తే నవ్వి చెయ్యి పట్టుకుని దగ్గిరికి లాక్కున్నాడు. ఈ అమ్మాయి చాలా పూర్వాచార పరాయణురాలు. దైవభక్తిలో, భర్తసేవలో, పెరిగిన మనిషి, పరపురుషుల ధ్యానం యించువర కాదు. అట్లాంటిది బలవంతంగా తటస్థించినా చాల ఘోరపాపమని జంకుతుంది. అతనిపైని గౌరవంచాతా, భయంచాతా, యేమీ అనకపోయినా అతన్నించి తప్పించుకుని, ఒక్కమాట మాట్లాడకుండావెళ్ళిపోయింది. మళ్ళీ వొంటరిగా ఆయింటికి వెళ్ళలేదు. కాని అతనికిమాత్రం ఈమెమీద మమకారం యేమాత్రమూ వదలలేదు.

పర్నాడు ఆపరేషన్ నిశ్చయ మయింది. ఆ సాయంత్రం ఆ అమ్మాయి భయంతో డాక్టరింటో యెదురుగా కూచుంది. తన భార్య పక్కింటిలోకి వెళ్ళినప్పుడు, ఈమెతో "పూరికే యేడవకు—ఈ డాక్టర్లకేం తెలుసు — ఈ ఆపరేషన్ లేకుండా అనేక మందులున్నాయి - మళయాళంలో శాస్త్రగంలో అనేక క్రియలున్నాయి—అవి నాకు తెలుసు—డాక్టరాస్పత్రికి వెళ్ళిం తరవాత రా చెప్తాను" అన్నాడతను—ముందు వేళాకోళ మనుకుంది. కాని ఆలోచించగా, ఒకవేళ అతని కేదన్నా మంత్రం తెలిసివుండకూడదా అని తట్టింది, ఆపరేషనంటే ఆమెకున్న మహాభయమూ, బిడ్డమీది ఆపేక్షా ఆమె విశ్వాసాన్ని మరింత బలపరిచాయి. ఇంటికివెళ్ళి భర్తతో చెపితే, తప్పకుండా వెళ్ళి కనుక్కోమన్నాడు-ఆమె రాగానే, డాక్టరుభర్త కూచోపెట్టి ఈ సంగతులు మాట్లాడాడు.

"ఈ పిల్లలు పుట్టకపోవడము, నీ లోపమూ కాదు, నీ పూర్వజన్మ లోపమూ కాదు. దేవుడికి నీమీద ఆగ్రహమూ కాదు—లోకంలో గడ్డిపరకలకి కెయ్యిగింజలూ, ఈగలకి లక్షగుడ్లూ ప్రసాదించే ఈశ్వరుడు నిన్ను గొడ్రాలి చెయ్యాలని వుద్దేశ్యపడతాడా? లోకమంతా జననీప్రేమతో మోగిపోతూవుంటే "బిడ్డో!" అని యేడ్చే నీకు బిడ్డలు లేకపోవడ మేమిటి? పోనీ, నీ దేహంలో దుష్టతవుందా? యేమీలా లేదు. కోపం తెచ్చుకోకు, లోపమంతా నీ భర్తది. ఆయన వంశంలో పిల్ల లెక్కువమంది వుండరు—అవునా?"

"మరి ఆయనకి ఆపరేషన్ చెయ్యాలా?"

"లాభం లేదు."

"ఐతే యెట్లా ?"

"యెట్లానూ లేదు."

"ఏదో చెప్తామన్నారు, మరి !"

"మరి చెపితే కోపం తెచ్చుకోవుకద !"

"చెప్పండి"

"నీకు ఆవు వుందనుకో, దానికి చూడకావాలి. ఒక యెద్దు దగ్గిర యెదకాకపోతే ఏంచేస్తావు ?" సిగ్గుతో మాట్లాడలేదు

"చెప్పుమరి ! యింకో యెద్దుదగ్గిరికి తోల్తారు అంతే."

మాట్లాడకుండా కూర్చుంది స్తంభించిపోయి.

"నేను చెప్పేమాట విను. నీకు పిల్లలంటే వెర్రి. పిల్లలు లేకుండా బతకలేవు. గంపెడు పిల్లల్ని కడుపారా కనేందుకు నిన్నూ నీ శరీరాన్నీ, నీ మాతృహృదయాన్నీ సృష్టి ఏర్పరిచింది. అందుకే యీ బాధ. నీకు పిల్లలూ, వారిమీగి ప్రేమా, స్త్రీకి జన్మహక్కు, సహజం. అవే స్త్రీ జీవితానికి మకుటాలు. అవిలేక జీవితం శుష్కం, అర్థహీనం. అందుకనే యెంత అణుచుకుందామని ప్రయత్నించినా అణగని ఆబాధ నీకు. యింక ముందు యింకా బాధపడతావు. ఈ యాత్రలూ, మంత్రాలూ, ఆపరేషన్లూ యేంలాభం ? ఆయన్ని మార్చవు కదా ?"

"ఆయనకేమీ జబ్బులేదే ?"

"లేదు. కాని యిదే జబ్బు."

"యేది ?"

"నీకూ ఆయనకీ జత కుదరలేదు."

"ఐతే."

"జత కుదుర్చుకోవాలి."

"అంటే ?"

"వేరే పెళ్ళిచేసుకోవాలి——"

"ఆయన చేసుకునేం లాభం ?"

"ఆయన కాదు నువ్వు——"

"నేనా ? పెళ్లా ?"

"పెళ్ళంటే పల్లకీలో వూరేగడం కాదు. యింకో భర్తని బిడ్డలకోసం మాత్రం—" మధ్యనే "ఛాండీ" అని లేచింది.

"ఆ కోపమే వొద్దన్నాను. బిడ్డల్ని యెత్తుకోకుండా, ఆడించకుండా వాళ్ళ ముద్దులు చూడకుండా వుండగలవా? వెళ్ళేవు. ఒక్కమాట విను. మా అబ్బాయిని చూశావుగా! అట్లాంటివాడు పుడితే! మేము సంతానాలకి ప్రసిద్ధి. మాగాలి తాకతేచాలు. మేము పన్నెండుగురం మా తల్లికి. మాలో ఒక్కొక్కరికి నలుగురు పిల్లలకన్న తక్కువలేరు."

వెళ్ళిపోయి, రాత్రంతా ఆలోచించుకుంది. మర్నాడు సాయంత్రం డాక్టరు భర్త టెన్నిసుకి వెళ్ళతో వుండగా, ఆమె గుమ్మంలో సిగ్గుతో యెదురయ్యింది. ఆ సాయంత్రానికి ఆమెతో ఇంట్లోనే వుండిపోయినాడు......

ఆమె ఆపరేషన్ మానేసి తన వూరు వెళ్ళింది, మూడు రోజుల తరువాత. యేడాదైన తరవాత ఎక్కని పాపాయి నెత్తుకుని వొచ్చింది, డాక్టరు దగ్గిరికి—ఆ అమ్మాయి భర్త చాలా సంతోషంతో, గర్వంగా— "ఆపరేషనన్నారు. ఒక వంద వొదిలేవి! యేమి లేకుండానే యెట్లాంటి పిల్లవాడు కలిగాడో? ఈశ్వరుడి దయవుంటే యానున్నా జరుగుతుంది" అన్నాడు.

డాక్టర్సు, భర్తని పిలిచింది. "చిన్నప్పుడు మన పెద్దఅబ్బాయి అచ్చు యిట్లానే వుండేవాడు కదూ?" అంది.

డాక్టరుకి ఆ అమ్మాయి భర్త ఒక చీర యిచ్చాడు. డాక్టరు భర్తకి బంగారపువాచీ గొలుసూ యిచ్చింది, ఆ అమ్మాయి. అప్పణ్ణించి ఈమె కీర్తి దివ్యంగా వెలిగింది.

# అవతారమూ

పంచానన తీర్థులు స్ఫురద్రూపి, మంత్రిబలమూ, పరమార్థజ్ఞానమూ, శాస్త్ర పాండిత్యమూ, వున్న మనిషివలె కనపడతాడు. తాటిపర్తికి యెక్కణ్ణించి వచ్చాడో తెలీదు. ఆవూరి సుహోదాత, సితిపరుడు, రామచంద్ర రావుగారు యీయన్ని రైల్లో కలుసుకొని, ఆయన సంభాషణకీ ప్రజ్ఞకీ సంతోషించి తన యింటికి ఆహ్వానించాడు. తీర్థులుగారి శక్తివల్ల రామ చంద్రరావుగారికి లేక లేక చక్కని కొడుకు పుట్టాడు. ఆయన వదినగారు ఏదో మంత్రోపదేశమయింది. ఆయన మేనల్లుడికి క్షయ కుదిరింది. ఆయన అన్నకొడుకు బ్రహ్మసమాజం వొదిలాడు. ఇదిగాక వూళ్ళో అనేకమంది ఆయనవల్ల అనేక వుపకారాల్ని పొందారు. దెయ్యాలు పట్టినవాళ్ళకి నయం చేశాడు. కొందరికి కని, దారిద్ర్యం వొదిలించాడు. దేవీ వుపాసన, అర్థ రాత్రులు కుంకుమపూజ, బ్రాహ్మణ సంతర్పణ, నిరంతర వేదాధ్యయనం, జరుగుతూవుంటాయి ఆఇంట్లో. మొత్తానికి యీయన మూలాన వూరు మేలుకుంది. మధ్యాహ్నం పురాణంచెప్పడం, భగవద్గీతలు ఉపన్యసించడం, సూర్యనమస్కారాలు చేయించడంవల్ల అందరికీ పొద్దుపోతోంది. ఆ వూళ్ళోనే, ఆ ఇంట్లోనే స్థిరపడ్డాడు. ఏ వ్యాధివచ్చినా, అమ్మవారొచ్చినా, వానలు లేకపోయినా జపాలుచేసి నయంచేసేవాడు. అందరిమీదాదయా. ఒక్క దురభ్యాసం, దుర్గుణం లేదు ఆయనలో.

అందరికీ, ఆయనమీద అమితమైన భక్తి, ప్రేమ. ముఖ్యంగా స్త్రీలకు, అందులో వితంతువులకి. మొగవాళ్ళకి అయన్ని చూస్తే అతిభయం. ముఖ్యంగా వర్తకులకి, ఆయన్ని దిరించడమన్నా, ఆయన్ని గురించి రహస్యంగా నన్నా సరే తిరస్కారంగా మాట్లాడటమన్నా అందరికీ భయం. రామచంద్ర రావుగారిని బాకీ అడగవచ్చిన బెంగుళూరి వర్తకులు తండ్రీ కొడుకూ కూడా, ఎవరికీ అర్థంకాని జబ్బుతో, పదిహేనురోజుల్లో ఒకరి తరువాత ఒకరు చచ్చారు. ఆయన పూజలకి నూనె 'సప్లై' చేసే సుబ్బయ్య దబ్బిమ్మని అడి గినవారంలో, కాళ్ళమీద వుండులేచి నడవలేక పోయినాడు. పదిరోజుల్లో

పెళ్ళాం కురకాడితో లేచిపోయింది. ఆ దెబ్బతో తీర్థులు ఆవూరికి చక్రవర్తి ఐనాడు. అడక్కుండానే అన్నీ తయారుగా యిస్తారు. ధాన్యం, పాలు, బట్టలు, అన్నీ !

తీర్థులు కాబట్టి సరిపోయిందిగాని, యింకొకరే ఐతే, యీ ఆడవాళ్లు మధ్యాహ్నం మొదలు, రాత్రిదాకా ఆ యింటోనూ, గుళ్ళోనూ వుండడమూ, వొచ్చేవాళ్ళూ పొయ్యేవాళ్ళూ, పూజలకీ, భజనలకీ, సహాయంచేసే వాళ్ళూ ఆయనకి వుపచారం చేసేవాళ్ళూ యిదంతా పెద్ద 'స్కాండల్' ఐ వుండును. అనుమానా లెక్కువవును. కాని నోరెత్తడానికి, మనసులో నన్నా అనుమాన పడడానికి హడల్. ఇంటిదగ్గిర తిండి సరిగా దొరక్క అవస్థపడే మొగాళ్లు నోరెత్తి ఏమీ అనలేరు భార్యల్ని. ఆ వూళ్లో ప్రతి ఆడదీ, రోజూ కొకసారన్నా తీర్థులుగారిదర్శనం చేసుకుతీరుతుంది. ఎవరన్నా రాకపోయినారా, ఏం దుర్గమ్మగారు రాలేదు, అంటాడు. అంతే, అరగంటలో దుర్గమ్మగారు వొచ్చి పాదాలకు సాష్టాంగపడి, కారణం చెప్పుకుంటుంది. అట్లా వెలిగింది ఆయనప్రభ. ఆయన 'తల్లీ' అంటే, 'దేవీ' ఊ అంటుందని పుకారు. ఆయన దేవినితప్ప తక్కిన స్త్రీలందర్నీ 'ఏమే' అంటాడు. ఎవరూ ఆగ్రహించరు.

తీర్థులుగారి శిష్యకోటిలో ప్రముఖురాలు పున్నమ్మ. ఆమె సాత్వికురాలు. బాలవితంతువు. పదహారేళ్ళది. కలరాతో అవసానదశయందున్న ఆమెకి గతియైన అన్నకి ప్రాణదానం చేశాడు తీర్థులు. పదోయేట వితంతువైనప్పట్నించి, ఆమె యవ్వన సౌందర్యం యెటువంటి చిక్కుల్లోకి ఆమె నీడుస్తుందో అని భయపడి యోచించి, శ్రమపడి, ఆమెను పురాణాల్లోనూ, గౌరీభక్తిలోనూ, పూజల్లో, సంస్కృత వేదాంతాల్లో పెంచారు. పున్నమ్మకి జీవితంమీద యింకా విరక్తికలగాలని తీర్థులదగ్గిరికి బోధనకై ప్రవేశపెట్టారు. తీర్థుల రూపవిలాసాల్నూ, ధీరత్వమూ, శిక్షణాలు, ఔన్నత్యమూ, పున్నమ్మ లేత హృదయాన్ని దిగ్భ్రమ నెత్తించాయి. ఆమెది చిన్న శరీరం. ఆమెరంగూ, నల్లని పెద్దజుట్టూ, రవికలేని పమిటలోంచి కనపడే బిగువు బుజాలూ ఆమెకి చాలా అందాన్నిచ్చాయి. తాను చిన్నప్పట్నించి ఆరాధించే దైవం తీర్థుల్లో ఆవిర్భవించాడు పున్నమ్మకి. ఆయనకోసం ప్రాణ

మివ్వడం ఒక గొప్పకాదు ఆమెకు. ప్రొద్దున్నే వెళ్ళి దినమల్లా ఆయన సేవలో గడిపి, రాత్రి ఆయన పడుకుంటేగాని యింటికి రాదు. తీర్థులగారేం చేస్తున్నారని అడగడానికిగాని, ఆయన అనుగ్రహాన్ని సంపాయించడానికి గాని ముందు పున్నమ్మగారిని సమీపించాలి. ఎవరికీ వుపదేశించని రహస్య మంత్రాన్ని వేదాంత రహస్యాన్ని ఆమెకి వుపదేశించాడని చెప్పుకుంటున్నారు ప్రజలు. పున్నమ్మ యిప్పుడు ఒక్కనిమిషం తావళం తిప్పడం మానదు. ఎప్పుడూ కళ్ళు ధ్యానంలో రెప్పలు వాల్చివుంటాయి. వృధాగా ఒక్కమాట మాట్లాడదు. ప్రతినిమిషమూ ఈశ్వరనామముచ్చరిస్తూ వుంటుంది. అంత చిన్నపిల్ల ముఖంలో ఆ దివ్యతేజం చూసి అందరికీ అద్భుతంగా వుంది. ఆమె మీద పూజ్యభావం హెచ్చయింది.

ఒకరోజు ఎండాకాలపు రాత్రి పున్నమ్మ తీర్థులకి కాళ్ళు పిసుకుతోంది. అర్ధరాత్రయింది. ఎవరూ లేరు. గురువు కళ్ళు మూశాడు. ఇంక యింటికి వెళ్లవొచ్చనుకుంటోంది పున్నమ్మ. తీర్థులు చప్పున వొణకడం ప్రారంభించాడు. ఎన్నడూ జబ్బెరగని ఆయనికి యీ జబ్బేమని పున్నమ్మ చాలా భయపడ్డది. ఈ జాడ్యాలకూ, బాధలకూ అతీతు డనుకుంది ఆయిన.

"చలి, చలి, కాలువకప్పు."

కాలువలేదు అక్కడ.

"ఏదో వొకటి కప్పు, తొరగా!"

తీసుకురావడానికి వెళ్ళబోతోంది.

"వెళ్ళకు. ఒక్కనిమిషం ఆగలేను కప్పు ఏదో ఒకటి."

"ఏంలేదు."

"తొరగా."

"ఎవరన్నా పిలుస్తా."

"వొద్దు తొరగా."

"ఏంలేదు"

"నీజుట్టు కప్పు."

దగ్గిరకు వెళ్ళింది. ముడివూడదీసి ఆ పెద్ద జుట్టును విదిలించి కప్పుకున్నాడు.

"హాయి! హాయి! అమ్మా బావుంది...బావుంది...యింకా చలి... అబ్బా దగ్గిరికి...యింకా దగ్గిరికి, నీ జుట్టులో నీవొంటో యెంతవేడుందో! ఎంతచలి, ఎంతచలి, యింకా దగ్గిరిగా!"

పున్నమ్మకి ఆశ్చర్యంగావుంది.

దగ్గిరికి లాక్కుంటున్నాడు. మెల్లిగా ఆమె నంతా ఆక్రమించు కుంటున్నాడు. వూరికే వొణుకుతాడు. పున్నమ్మ ఏ పురుషుణ్ణీ అంత వరకు తాకలేదు. ఆమెకు స్పష్టంగా తెలీదు పురుష సంబంధమంటే ఏమిటో. ఆమె కసలు ఆ వాంఛ యెన్నడూ ప్రారంభించలేదు. కొంతసేపు చూసింది. తిరుల చెయ్యి ఆ వొణుకులో యిటూ అటూ ఆమెశరీరంలో కదులుతోంది. పున్నమ్మకి అది సహజంగా తోచలేదు. ఏరోగానికీ అది చిహ్నంగా కన పడదు. లేచి వెళ్లిపోవాలనివుంది. అసహ్యం సహజంగా కలుగుతోంది. కాని అమితమైన భయం. కోపమొస్తే ఆయనకి తాకేహాతుంది? ఏదేవతనో తనమీదికి పంపితే? శపిస్తే? కొంచెంసేపుండి—

"వెడతాను, యింకి పచ్చడం తెస్తాను" అంది.

"ఊఁ, మాట్లాడకు నేను దేవిని. ఉగ్రస్వరూపిణిని. నీవు నాభక్తు రాలివి. నిన్నావహిస్తున్నాను. నేనే నువ్వు నువ్వే నేను. భిడ్డా, ఏమీ వినకు, నీభక్తికి మెచ్చాను. నీలో ప్రవేశిస్తున్నాను. నాశక్తి నీలోపల ప్రవేశిస్తోంది. నాదివ్యశక్తి - నీవొళ్లంతా వొణుకుతుంది, గగుర్పొడు స్తుంది. చెప్పలేని ఆనందం కలుగుతుంది. నాదివ్యస్వరూపం నువ్వు చూడ లేవు. కళ్లుపోతాయి. మూసుకో. కళ్లు మూసుకో—"

అబ్బా యిదేమిటి? యిట్లా చేస్తున్నాడు? వొళ్ళంతా నీరసమై పోతోంది. తనని ఊపిరాడకుండా అదుముతున్నాడు.

"వుండండి—స్వామీ—నన్నొదలండి."

"స్వామి ఎవరు? మాట్లాడకు. చచ్చిపోతావు. పాపం! భస్మమై పోతావు. కదలకు అయిపోయింది. వుండు—నేను యీశ్వరిని. నాజ్యోతి నీలో ప్రవేశించింది. ధన్యురాలివైనావు."

కళ్లుమూసుకుంది. అతని వూపిరి అతితీక్ష్ణంగా ఆమె మొహానికి తగులుతోంది. "ఏం జరిగినా, ఏమైనాసరే కదలకు. కదిలావా, తల

సహస్ర........నేను మంత్రస్వరూపిణిని. మహామంత్రంలో వున్నాను."
ఆమె కదలలేదు.

తెల్లవారికట్ట మూడింటిదాకా చలి ఆగలేదు, తీర్థులకి.

రెండు నెల్లయింది.

ఒకనాడు మధ్యాహ్నం పున్నమ్మ శిరసువంచి భక్తితో "నాకు మందు కావాలి" అంది నమ్రతగా.

"ఎందుకు?"

"ప్రొద్దున్నే వాంతులుగా వున్నాయి"

"ఓహో! సరే నయంచేస్తాను"

ఆనాటినించి ప్రతిదినమూ తీర్థులు ఏవో గొప్ప గొప్ప మందులు తయారుచేసి యిచ్చాడు—కాని డోకులు మాత్రం కట్టనేలేదు. "ఈ మందుతో యిల్లాంటి డోకులు ఎన్నో కట్టించాను. కాని నీదేహం చాలా విచిత్రంగా వుంది. ఇంక లాభం లేదు. ఇవి కట్టేడోకులు కావు. మంత్రమో తంత్రమో ప్రయోగించాలి" అన్నాడు.

మూడునెల్లయింది. పున్నమ్మకళ్ళు యింకా అంతర్ముఖములైనాయి. ఆమె చంపలు యింకా పాలిపోయినాయి. ఆమె మాటలు యింకా తక్కువైనాయి. ఆమె సేవలు యింకా పొద్దు పోతున్నాయి.

తీర్థులు ఆవర్షాకాలం యజ్ఞం మొదలుపెట్టాడు. అగ్నిగుండము ముందు ఆయన కూర్చొని వున్నాడు. వందమంది బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. పున్నమ్మ సామగ్రులు అందిస్తోంది. ఊరంతా ఆహ్వానింపబడ్డారు. తీర్థులులేచి యిట్లా మాట్లాడాడు "ఒక గొప్పవిశేషం. యీదేశానికి, యీదేశానికే కాదు, లోకానికంతా మంగళకరమైన వార్త నేనుమీకు చెప్పబోతున్నాను. ఈ కాటిపర్రు ఈశ్వరుడిచేత అనుగ్రహింపబడ్డది. ఈ ప్రజలందరూ ధన్యులు. ఇంత పుణ్యక్షేత్రం కావడంచేతనే యీశ్వరుడు నన్నిక్కడికి పంపినట్టున్నాడు. ఈవూరి నామం యింకా లోకమంతా మోగబోతోంది, నిన్నరాత్రి రెండు గంటలప్పుడు ఒక పెద్ద వెలుగు బంగారుతేజము బంగారు మెత్తదనము కలది ఆకాశంమీదనించి బైలుదేరి మెల్లిగా క్రమంగా భూమి మీదికి దిగింది. నేను చూస్తోనే

వున్నాను. అంతవరకు నాకు నిద్ర పట్టించనేలేదు. నా హృదయంలో అద్భుతమైన భక్తి వుద్భవించింది. దేవతలు నిస్వనము లూదారు. పుష్పవర్షం కురిపించింది. మునులు కీర్తనలు పాడారు. అవన్నీ మీకు వినపడవు. ఆ తేజస్సు భూగోళముపైని ఒక్క నిమిషమునిలిచి వెలికి, మనదేశంవేపు తిరిగి, మనవూళ్లో ప్రవేశించింది. ఏదో అవతార ప్రారంభమని నాకు తెలియనే తెలుసు. ఈ తాటిపత్రులో యేగర్భంలోనో యీశ్వరతేజస్సు అవతారమెత్తిందని స్పష్టమయింది. కాని యీ అవతారం అవసరమేమని యోచిస్తూ నిద్రపోయినాను. కన్నులు మూయగానే నాముందు శ్వేతాంబరధరుడు, రక్తనేత్రుడు, దయాప్రపూరుడైన దేవదూత దివ్యతేజస్సుతో వెలుగులో, నిలబడి యిట్లా అన్నాడు. "వత్సా! యిందాకటి వెలుగును నువ్వు చూసేవుంటావు. దాన్ని రహస్యాన్ని నీకు తెలపడానికై నేను పంపబడ్డాను ఆ దివ్యతేజస్సొక మనుష్య గర్భాన ప్రవేశించబోతోంది. దానిని కాపాడవలసిన విధినీపైన నిర్ణయింపబడ్డది. నీ తరువాత పుణ్యాత్ములైన యీ పవిత్రక్షేత్రపు ప్రజలపైనవుంది. ఈ అవతారానికి కారణము విను. పురుషధర్మం చెడ్డదా, లోకానికి ఆపదలేదు. కాని గృహిణి, మాత, యైన స్త్రీ శీలం చెడిందా ప్రపంచం మొదలంటు నాశనమే. కలిపురుషుడు పురుషున్ని ఆక్రమించాడు, ధ్వంసం చేశాడు, పరిక్రమించాడు. ఇప్పుడు స్త్రీలని కదిల్పాడు. ఈనాడు స్త్రీల ధర్మాన్ని ఆచారాన్ని నాశనానికై బద్ధకంకణుడైనాడు. అతని అధికారం సాగిందా, యింక ప్రపంచ వినాశమే! ఆ ఆపదనించి లోకాన్నుద్ధరించడానికే యీఅవతార మవసరమయింది. ఎంతో బలవంతంమీద తన అర్ధాంగిని, పార్వతిని, కొంతకాలము యెడబాసి వుండడానికి మంగళమూర్తి పరమేశ్వరు డంగీకరించాడు. సమస్త దేశాలలో పవిత్రదేశమూ, కర్మభూమియైన యీ భారత స్త్రీధర్మ పునరుద్ధారణకై, విరివిగా వ్యాపిస్తున్న యీ పునర్వివాహ, విద్యాది మహాపాతక విధ్వంసనానికై అంబ అవతారమెత్తుతుంది. మహిషాసుర మర్దని సంహారక్రియ మర్దని కాబోవుతున్నది. ప్రాముఖ్యంగా స్త్రీ పాతివ్రత్యానికి మూలవిరాటగు నితంతువుల నుద్ధరింపబూనిన పార్వతి నితంతుగర్భాన్నే జన్మమెత్తి పురుషుడి నిమిత్తం లేకుండానే తాను ప్రవేశించి, అవతారమెత్తబోతున్నది.

శేషు రాత్రి గర్భప్రవేశము, నవమాసములు కాలాతీతముగనుక, వస్త్రాసాలలోనే ఆమె భూపతనము కాదలుచుకున్నది. ఈపుణ్యక్షేత్రంలోని వితంతువర్గంలో ఒకరిని దీక్షాపరురాలిని ప్రత్యేకించి నీవు చూచినట్లయితే, ఆమెలో ప్రవేశింప ఆ జ్యోతి పూనుకున్నది" అని చెప్పి అంతర్థానమైనాడు.

"ఎవరు ఆ అనుగ్రహానికి పాత్రులో, మీలో ఎవరో, నిర్ణయించండి. కాని ఒకటి మరచిపోకూడదు. ఆమె వితంతు వై వుండాలి. ఇంతవరకు ఏ పురుషస్పర్శను యెరిగివుండకూడదు. ఈ విషయమై ఏమాత్రము దోషమున్నా ఆ జ్యోతి భగ్గున నిలువునా మనిషిని కాలుస్తుంది. "ఎవరు యోగ్యులో వారే అగ్నిగుండాని కెదురుగా నిలబడండి" అన్నాడు. సభంతా నిశ్శబ్దం. ఎవరూ ముందుకురాలేదు. "ఎవరూ! ఒక్కరూ, లేరా?" అన్నాడు.

ఎవరూ లేరా, యీ పుణ్యక్షేత్రంలో ?

బాల వితంతువులను వెతుకుతున్నాయి, సభికుల కళ్లు.

"ఎవరూ రాకపోతే,—"

అంటూ క్రిందికివాల్చిన కళ్లతో, వొణుకుతున్న పెదవులతో మెల్లిగా వచ్చి నుంచుంది. పున్నమ్మ.

పున్నమ్మనిచూచి అందరూ ఆనందపరవశులైనారు. "ఈనాటినించి ఆర్నెల్లవరకు నీ శీశ్వరపత్నివి, సుమంగలివి, ధన్యురాలవు." అని తానే కుంకుమను ఆమె నొసటు పెట్టాడు. పూలదండలు వేశాడు.

ఆ రోజునించి పున్నమ్మ పూర్తిగా ముత్తయిదువేషం ధరించింది. ఆ పుణ్యవేషం ఆమెకి క్రొత్త అందాన్నిచ్చింది. ఆ ఆర్నెల్లు ఆమెని మధ్య కూర్చోబెట్టి భజనలు, పూజలూ, నమస్కారాలూ, నైవేద్యాలూ, ఎగిరిపోతున్నాయి. ఈ వార్త వ్యాపించి అనేక ప్రదేశాలనించి ప్రజలువచ్చి చూచి పోతున్నారు. విచిత్రంగా ఆమెకి గర్భచిన్నాలన్నీ కలిగాయి. తీర్థులు కూడా ఆమెకి నమస్కారాలూ, పూజలు సాగించారు. తనకి చాకిరీ చెయ్యనీడు. తన శుశ్రూషకి రాత్రులు వుండనీడు. రోజూ అందర్నీ కూచోబెట్టి, ఆ అవతారకన్య చెయ్యగల ఘనకార్యాలనూ, పునరుద్ధరణనూ గురించి పెద్ద వుపన్యాసాలిస్తున్నాడు. త్రిలోకాలూ సంతోషిస్తున్నాయనీ, దేవతలు

మంగళహారతులతో వొచ్చిపోతున్నారనీ, పూలవర్షాలు కురుస్తున్నాయనీ; కాని అవిశ్వాసకులు ప్రబలం కావడంచేతా, మ్లేచ్ఛప్రభుత్వం కావడం చాతా, ఆ వుత్సవాలన్నీ ప్రజల కంటబడేటట్టు చెయ్యటం లేదన్నాడు.

ఆఖరికి తీర్థులు చెప్పినట్లు ఆరోనెలకూడా నిండకుండానే నొప్పులు వచ్చాయి. ఈ వార్త వ్యాపించగానే చుట్టుప్రక్కల ప్రజలందరూ వేల కొలది పోగైనారు. ఒకటే భజనలు, ప్రార్థనలు, వీలైనంతమంది స్త్రీలు గదిలోపల చేరారు. నాలుగు గంటలు శ్రమపడ్డతరవాత "ఉదయించింది ఉదయించింద"న్నారు ఉత్సాహాలు జరుగుతాయో, యేలోక శుభసూచ కాలు కలుగుతాయో, తమ కళ్లు భరించగలవో లేదో అని అందరూ కళ్ళు మూసుకున్నారు. ఎంతకాలం కళ్ళుమూసుకున్నా యేమీ జరగలేదు. కళ్ళు తెరిచారు. గదిలో వాళ్లు బిడ్డనిచూపరు, మాట్లాడరు.

చివరికి తీర్థులువొచ్చి—

"నాకు తెలీకండా దేవికి ఏదో అపచారం జరిగింది. కనక అవతారం వుపసంహరించుకుంది. జపంచేసి కనుక్కుని చెపుతాను" అని మళ్ళీ కన పళ్ళేదు. ఆ వూళ్ళో చివరికి పుట్టినపిల్లని చూస్తే కదలడంలేదు. దానికి మొహమంతా గుంటలు, ఎవరో డాక్టరొకడుండి—'యిది సిఫిలిస్' పిల్ల రా" అన్నాడు.

# ఎదగనేలేదు

గోదావరి యిసికలంకల వెనక సూర్యుడు అస్తమిస్తున్నాడు. నల్లని నీడ మీద, తెల్లని తెరచాప తేలిపోతోంది. వూళ్ళోంచి బిందెపట్టుకొని ఒక అమ్మాయి మా రేవువేపు వొచ్చింది. మమ్మన్ని చూసి కళ్ళుదింపి మాతో నాకేమీ సంబంధంలే దన్నట్టుదూరంగా వొంపుతిరిగి రేవులోకి దిగింది. ఆమె వొళ్ళు సన్నం. ఏళ్ళు పద్దెనిమిది వుండవు. కళ్ళల్లో బండికి కట్టే ఎద్దుకి వుండే 'యింక యీచాకిరీ, బాధా తప్పవనే' నిరాశతోకూడిన దీనమైన చూపు వొళ్ళంతా జావవలె కిందికి వేళ్ళాడిపోయింది. అంత సన్నని వొళ్లు అట్లా జారిపోతే, చాలాఅసహ్యం వేస్తుంది, ఎంత అన్యాయం జరిగిందో అని, విచారం కలుగుతుంది. బిందెలో నీళ్ళు ముంచి, యెత్తబోయి ఆయాసపడి, కళ్ళు కిందికివాల్చి నుంచుంది. ఎవరన్నా ఆడవాళ్లు వొస్తున్నారేమోనని చూసింది. ఎవరని అలలు బిందెని ప్రశ్నిస్తున్నాయి. రామ్మూర్తి మెల్లిగా లేచి బిందెపట్టుకుని ఆమెబుజానికి ఎత్తబోయినాడు. కాని ఆమె చప్పున పక్కకు తిరిగింది, బిందె నక్కడే పెట్టి వెనక్కివొచ్చి కూచున్నాడు. ఆమె అభిమానం యెక్కువై ముందు ఆనీళ్ళన్నీ పారపోసింది. మాకు కులంలేదని తెలుసునా అనుకున్నాను. మళ్ళీ ముంచుకుని, కష్టపడి మోకాలుమీద మోపుకుని, ప్రయత్నించి బుజాని కెత్తుకుంది. ఆబిందె బరువు కింద ఏ నిమిషాన ముద్దగా కూలుతుందో అనిపించింది నాకు.

సూర్యుడు బ్రిడ్జి వెనకాల ఇసికదిన్నెలలో అస్తమిస్తున్నాడు. నీటి కాకులు మాసెత్తిమీదిగా యెగిరిపోతున్నాయి. నిరాశలో గోదావరినీళ్ళు వొడ్డున తపుకుమని కొట్టుకుంటున్నాయి. మా హృదయాల్లో చెప్పలేని భీతితో కూడిన దిగులు కలిగింది. జీవితంలోని నిరాశలూ, నిస్ప్రుహాబసమూ, కష్టమూ, అంధకారమూ, అన్నీ మనసుల నావరించాయి.

వుండుండి రామమూర్తి,

“వాణ్ణేం చెయ్యాలంటావు?” అన్నాడు. ప్రేమించి ప్రేమించి ఒక రవ్వ సాఫల్యము పెరగక అట్లానే చచ్చిపోయినవాళ్ళ గంభీరమైన బాధని గురించి యోచిస్తున్న నామనస్సుని తప్పి' నేను

"ఎవర్ని?" అన్నాను.

"ఆ అమ్మాయిని యీ విధంగా చేసిపెట్టిన రాక్షసుణ్ణి."

"ఏమిటి నేనా?"

"మూడేళ్ళలో చూడు, ఆ అంగాన్నంతా—ఆ....అం....దా....న్నం...తా...ఆలావ...ణ్యాన్ని...కోమ...లత్వా...న్ని..."

"ఏరుగుదువా యేమిటి?"

రామ్మూర్తి నామాట వినిపించుకోలేదు. అతని దృష్టి యెక్కడో జ్ఞాపకంలో వుంది.

"బడినించి నవ్వుతో పరిగెత్తుతో వెడుతోండేది, లేడి పిల్లలాగు—గంతులేస్తూ, నవ్వుతో, యిటూ అటూ సంతోషంగా చూస్తూ,...... పైకితిరిగిన చిన్న ముక్కూ, అమాయకపు చిన్న నోరూ—"

"ఆ పిల్లేనా, యీమె!"

"ఎదిగింది చక్కగా కోమలంగా యెదిగింది. మామిడిగున్న లాగు పెద్ద జుట్టున్నగా గుండ్రడగా మెడ—జుట్టు అరబోసుకుంటే కనపడేది. ఆ చేతులో! పాపం, పాపం అంత అందంగానూ పెరుగుతుం దనుకున్నాను. అట్లాగే కలకల నవ్వుతోనే ఎండలో నుంచోడమే వీధివంక చూడ్డమే ఆనంద మైనట్టు, చూసేది. ఇంకేం అందుకున్నాడు వాడు! బతకగలడా ఆమెని నలిపెయ్యకుండా? దేహాన్నే కాదు—ఆమె అందాన్ని, ఆనందాన్ని, మెదడుని, స్వేఛ్ఛని, జీవాన్ని కొరుక్కుతిన్నాడు. పీల్చాడు. పిప్పిచేశాడు. అయ్యో! ఆ హృదయాన్ని, కత్తితో పెల్లగించి తీసేశాడు. ఆ కళ్ళలో ఆ శూన్యదృష్టిని, నిరాశని, భీతిని చూశావా? ఏం చెయ్యనువాణ్ణి?"

"లేవదీసుకుపోదాం" అని నాకు తెలిసిన ఒక్కమాత్రాన్ని అనేశాను.

"ఎవర్ని?"

"ఈమెని"

"ఎందుకు?"

"వాడు యేడ్చి చచ్చేందుకు."

"చాలా సంతోషిస్తాడు. ఇక యీమె యెందుకు వాడికి! ఇంకెవర్ని పట్టి చీల్చుకు తింటున్నాడో! రాక్షసుడు! ఈ శవ మెందుకువాడికి?"

రామ్మూర్తి కోపంతో లేచాడు.

''వాడి కేమధికారంవుంది,' అందాన్ని యిట్లా నాశనం చెయ్యడానికి! ఒక మంచిపటాన్ని చింపితే తంతారే. బతికివుండి, హృదయముండి, రోజురోజు కొత్తగామారే ఆమె సౌందర్యాన్ని — యే చట్టప్రకారమూ ఏమీచెయ్యరూ? హృదయము చీల్చుకు తింటే ఏమీ చెయ్యరూ! స్వాంతుక పిపికితే వురితీస్తారే ?.. ...కలువకాడ నీళ్ళల్లోంచి కాంతివేపు వొంపుతిరిగినట్టు వుండేది ఆమె మెడ, ఆయవ్వనం మొదలుపెట్టినప్పుడు మెలిపెట్టాడు, తుంచాడు. దరిద్రుడు—"

సూర్యుడు అస్తమించినచోట రౌద్రగావుంది. గోదావరినీటిమీద నలుపు కమ్మింది. నల్లని కాళినాలుకలవలె నీళ్లు వొడ్డుని కోపంతో నాకుతున్నాయి.

నాలుగురోజులు తరవాత గోదావరి వొడ్డున ఆ చోటునే శవంచుట్టూ మనుషులు కూడారు సాయంత్రం. గుంపుల్లోకూడి దూరి, చూసివొచ్చాడు రామ్మూర్తి. మొహం అంతా తెల్లపడ్డది. కళ్ళుమాత్రం మెరుస్తున్నాయి చేతులూ పెదివలూ వొణుకుతున్నాయి.

"అడే ఆపిల్లే, చంపారు. చంపాడు"

అంటూనే ఆగుంపుని వెతికి ఒకడిమీద దృష్టినిలిపాడు· రాక్షసుణ్నో, ఘాతకుణ్నో చూసినట్టు చూస్తూ, చిన్నకళ్లు పెద్దవిచేసి, నా చెయ్యి గట్టిగా పట్టుకుని,

"వాడే, వాడే" అన్నాడు.

"ఎవరు ?"

"దాని మొగుడు."

ఇంక ఆలస్యమైతే యింకోహత్య జరుగుతుందని భయపడి, బలవంతంగా అతన్ని లాక్కుపోయి దూరంగా యిసికమీద కూచోపెట్టాను.

దాహమై వచ్చిన గబ్బిలం సొమ్మసిలి నీళ్ళమీదపడి తన్నుకుంటోంది. నెత్తిమీద రెక్కలొచ్చి ఎగిరిపొయ్యే నీళ్ళ కాకి జాలిగా అరిచింది. నలుపు రెండో వొడ్డుని మింగేసింది.

ఒక్కమాటు, మాట్లాడ్డంకూడా సహించని దిగులులో యిద్దరమూ కూచుని వున్నాము.

శవంచుట్టూ వున్న గుంపు చెదిరిపోయింది. మసకలో ఒక మనిషి అట్లా నడుస్తూ మావేపు వచ్చి, మాకు కొంచెం దూరంలో కూచున్నాడు. రామ్మూర్తి చప్పున తలెత్తి అతన్ని చూసి—

"ఎందుకు చంపావు?" అని అడిగాడు.

"నేనే చంపానా?" అన్నాడు అతను, మాతో కాక, తనని తనే ప్రశ్నించుకున్నట్టు.

"నువ్వే! ముమ్మాటికీ నువ్వే! ఈ లోకంలో నీకు శిక్షపడక పోవొచ్చు..."

"నేనేనా! నేనే ఐతే శిక్షపడతాను. పడనుమరి! ఇంకా సందేహిస్తావేం? ?—"

రామ్మూర్తి లేచాడు.

"ఏంచేశావు? చెప్పు ముందు. ఏంచేశావు? నీ చేతులతో నువ్వేతోశావా? ఆమె అంతట ఆమె పడ్డదా, హింసించావా? దుర్మార్గుడా, పశువా?"

పెద్ద పోట్లాట జరుగుతుందని భయపడ్డాను. కాని తిట్లనీ, చివాట్లనీ లక్ష్యపెట్టే స్థితిలో లేడు. అతను ఆశ్చర్యంతో ప్రశ్నార్థకంగా నావంక చూశాడు. నేను రామ్మూర్తిని కూచోపెట్టాను. ఆభర్త వాలకం చూస్తే భయంకన్న విచారం ఎక్కువలాగు కనపడుతోంది. అతను నిర్దోషి అని అనుకున్నాను, అతనిమీద జాలికలిగింది. సానుభూతి కోసం వెతుకుతున్న వాడి వలె కనపడ్డాడు.

"ఇక్కడ వుండవద్దు ఛీ, పోదాం, రా" అంటున్న రామ్మూర్తిని లక్ష్యం చెయ్యక, ఆ భర్త పక్కన కూచుని—

"ఎందుకు చచ్చిపోయిందో తెలుసునా?" అని అడిగాను.

"తెలుసునో, తెలీదో, తెలీటంలేదు."

"తెలీదూ! ఎందుకు తెలుస్తుంది నీకు—" అని యింకా యేదో దూషించబోతున్నాడు రామ్మూర్తి.

"నన్నురుగుదురా! ఎందుకింత ఆగ్రహం!"

"ఎరుగుదునా! ఎరగాళ్లా! ఆమ్మైని పాపం, చిన్నపిల్లని, నలిపి, చీల్చి, పీల్చి, పీనిగనిచేసి, ఇంక వేరేచంపాలా? నిజంగా చంపితేనేం

చంపకపోతేనేం ? నీ మొహంచూస్తేనే పంచ మహాపాతకాలూ చుట్టు కుంటాయి."

ఎవరమూ మాట్లాడకండా కూచున్నాము. నేను దయగా—

"ఎందుకు గోదావరిలో పడ్డది ?" అన్నాను మళ్ళీ.

"పొద్దుణ్ణించి అందరూ నన్ను ఓదార్చినవారే. కాని అందరికీ మన సుల్లో నేనే చంపానని వున్నటుంది. నేనే కారణమని నమ్మకం. ఈయన కొంచెం పైకి అన్నాడు, అంతే భేదం. కాని నేనే కారణమా అని ఆలో చిస్తున్నాను.—"

"ఇంకా ఆలోచించాలా ! నువ్వు కాకపోతే ఇంకెవరు, ఆమె కళ్ళల్లోకి ఆ హృదయభేదకమైన చూపు తెప్పించింది?"

రామ్మూర్తి మాటల్ని లక్ష్యంచెయ్యక అతను చెపుతున్నాడు:

"మొదటినించీ మేము చాలా ప్రేమించుకున్నాము. ఆడవాళ్ళ వొంటిఅందమంటే నాకుచాలాతృష్ణ. ఇది చాలా అందమైనది. కాని వికార రూపాన్ని నేను భరించలేను. అందాన్ని చూస్తే, అందాన్ని చేత్తో తాకితే, ఇంక నావొళ్ళు నాకు తెలీదు. దానికీ నామీద చాలా మోహంవుండేది. యవ్వన పుష్టితింవల్ల, ఇంక మేము వొకర్ని వొకరం నలిపి, పీల్చి, రాత్రులు, పగలు యెంతో అనుభవించాము. అందుకోసమే ఒకరికోసం ఒకరం బతి కాము. భోజనమూ, అనుభవమూ, శక్తిని పోగొట్టుకోవడమూ, మళ్ళీ సంపా యించడమూ, ఇట్లా రెండు మూడు సంవత్సరాలు బతికాము. కాని అది రెండునిమషాల్లాగుంది నామనసులో. ఎండాకాలపు రాత్రులు, జోరుమనే వానలో గదిలో మేము వెచ్చగా క్రీడించిన ఆనందాలు, ఒకరిని ఒకరం గాఢంగా ప్రేమించి గాయపరచడం—అట్లాంటి ఆనందం జీవితానికల్లా ఒక్కసారే కలుగుతుంది. కాని క్రమేపీ అది నాచేతుల్లో నలిగి, వేళ్ళాడి పోవడం, నా కళ్ళు గుర్తుపట్టాయి. నేను గట్టిగా వాడుకునేస్తలము ప్రతిది కృశించింది. వాడిపోయి ముడతలుపడ్డది. నేనుమాత్రం అట్లానే వున్నాను. నాశరీరం ఇంకా అంపంగా తయారయింది. దాని ముద్దులలో కౌగిలిం తలలో—"

"పశువా!"

"నేనేం చేశాను? దాని కోరికా నాకోరికా ఏకమైనాయి. కాని సృష్టి స్త్రీలయెడల క్రూరమయింది. పువ్వులో అందం ఒక్కనిమిషంలో నశిస్తుంది, రాయి మెరుపు అట్టానే వుంటుంది. మనమేం చేస్తాం?"

"పెద్దవాడివి, ఆడదాని సౌందర్యాన్ని ధ్వంసం చెయ్యకూడదని తెలీదూ?"

"ఎట్లా తెలుసు! మీరుచెప్పారా? ఎవరైనా వొద్దన్నారా? మా మోహాన్నిచూసి, చాలామంది అసూయపడ్డారు. ఇంతలో దానికి గర్భం కలిగింది. అదివరకు దానిచేతులు సన్నపడ్డా, ఒళ్ళు కృశించినా, అద్దమువంటి దానిపొట్టనీ విల్లువంటి దాని నడుము వొంపునీ చూసి తృప్తిపడేవాణ్ణి. కాని ఆ నడుము సాగి, పొట్ట పెద్దదై, ఆ మొహంకూడా వాడేటప్పటికి, దాని వంక చూడ్డమే కష్టమయింది. పూర్వపు ప్రేమతో నాదగ్గిరికి వొచ్చేది. కాని చూడలేక కళ్లు తిప్పుకునేవాణ్ణి. అది తాకితే జెర్రులు పాకినట్టుండేది. దాంతో పడుకోవలసి వొస్తుందని, స్నేహితుల ఇళ్ళల్లో వుండేవాణ్ణి. తన మీద ప్రేమ పోయిందని యేడిస్తే యేమనను? పోయింది ఇంకరాదు. తన తప్పిదమేమని అడిగేది. ఏముంది?"

"అంతా నీ తప్పిదమే." అన్నాడు రామమూర్తి. "నాదా? నా కెంతో దిగులేసేది. నాకు ఏడుపొచ్చేది దాన్ని అట్టా కష్టపెట్టడం. కాని ఏమీ చాతనయ్యేదికాదు. దాన్ని లాలించడమన్నా చివరికి సాధ్యంకాలేదు. చీదరించుకున్నాను, తిట్టాను, దాన్ని మోహాన్ని భరించలేక, ఏమీలేనిదే ఎవరో నాకు ముండలున్నారన్నాను. రెండురోజులు కోపంతో మూతి ముడుచుకుంది, నేను బతిమాలుకుంటానని అది అనుకుంటే, నన్ను వొదిలింది కదా అని నేను సంతోషించాను. కాని "పోనీ, క్షమించానం"టో వొచ్చింది, ఇంక భరించలేక తన్నాన-పోయింది-దాన్ని యెంతో హింసించాను. కాని యెంత ప్రయత్నించినా నాకు ఆ అసహ్యం ఆగలేదు. ఆ గర్భిణీ స్త్రీని కొట్టటం ఎంత పేగులు తరుక్కుపోయినా, పశ్చాత్తాపం చూపానా, నన్ను పట్టుకుంటుందని భయం. అంత దుఃఖమూ లోపల అణుచుకుని, జాలిని చంపుకుని, కోపంగా కనపడేవాణ్ణి. ఒకనాటి రాత్రి, అది యెంత ప్రేమతో లేపినా, మాట్లాడకండా పడుకుంటే, పాపం, విసుక్తి,

"పోనీ, కొట్టండి. అదే బావుంటుంది" అంది. ఎంత యేడ్చానా రాత్రి! పూర్వప్రపేమ జ్ఞాపకం తెచ్చి ఏడిపించేది! ఓహో! మేము గడిపిన రాత్రులు, మాసరసాలు, మానవ్వులు! యామైనారో! దానిపాదాలదగ్గిర కూచుని "నువ్వు నారాణివి. నాహృదయేశ్వరివి. ఈ బతుకునంతా వెలిగించావు. నువ్వు లేనిది ఒక్కనిమిషం బతకలే" ననడం జ్ఞాపకమొచ్చేది. ఏం చెయ్యనూ, "అన్నీ దొంగమాటలేనా," అని అది అడిగితే పేగులు తెగుక్కుపొయ్యేవి. చివరికి ఒకవిధంగా దాన్ని వోదార్చాను. పురుడుకాగానే మళ్ళా అందంగా వుంటుందనీ, ఆ గర్భిణినెలలలో మోహం ఆరోగ్యంకాదనీ చెప్పాను. నమ్మింది కొత్త సంతోషంవొచ్చింది. కిలకలనవ్వింది. ఎంతో ప్రయత్నించినా దగ్గిరికి రాలేదు, అటుతరవాత."

"ఒకనాటి రాత్రి దానికి నరాలు పట్టుకున్నాయి. మా అత్తా, దాని చెల్లెలూ, వొచ్చి పడుకున్నారు. రాత్రి అవసరమొస్తుందేమోనని, అదీ, దాని చెల్లెలూ పట్టెమంచంమీద పడుకున్నారు. దానిపక్కన కింద చాపేసుకుని మా అత్త పడుకుంది. కొంచెం దూరంగా కిటికీదగ్గిర నులకమంచంమీద నేను పడుకున్నాను. ఇదంతా యెందుకు చెప్తున్నానంటే అంతాకర్మ, కర్మ తోసుకొస్తుంది. మనం బుద్ధిపూర్వకంగా చేసేది తక్కువ. మా గదికి ఒకటే కిటికీ. అది రోడ్డుమీదికి తెరుచుకుంటుంది. మూసుకుంటే గాలిరాదు. అందుకని దీపంలేకుండా చీకట్లో పడుకోడం మామూలునాకు. రాత్రిదాహమై మెలకువవొచ్చింది. చెంబుకోసం వెతుకుదామంటే మా అత్త మధ్య యెక్కడో పడుకునివుంది. పడుకున్నాను, కాని నిద్రరాదు. అత్తనిపిలిస్తే అది లేచి మళ్ళీ మూలుగుతుందని భయం. నిద్రపోకపోతే మర్నాడు ఆఫీసులో నిద్రా, పోష్టుమాస్టరు కోప్పడ్డం, జ్ఞాపకమొచ్చి, లేచి కూచ్చున్నాను. మంచం మెల్లిగా దిగి, నేలమీదజరుగుతూ, చెంబుకోసం వెతికాను. ఇటూఅటూ తడిమాను. నా వూపిరి దగ్గిరిగా నాకే వినబడుతోంది. మా అత్తని కాలి యెక్కడ తడుముతానో అని భయం. ఆమె యేమనుకుంటుందో ఇట్లా అనుకుంటూ వుండగానే, నాచెయ్యిసరిగా శూంద్రని వెచ్చని ఆమె రొమ్ముమీదపడ్డది. భయంతో వొణికాను. అరుస్తుందో తిడుతుందో, కావలినే చేశానంటుందో! చెయ్యి చప్పున తియ్యబోయినాను. ఆమె నాచెయ్యినక్కడే పట్టుకుని

ఆపింది. నిజంగా చెపుతున్నా, ఆమెమీదయెప్పుడూ అట్లాంటివుద్దేశం నాకు లేదు. ఆ నిమిషానా ఏమీ కోర్కె కలగలేదు. కాని ఆ అవస్థలో ఆమె చెయ్యిపట్టుకుంటే నేనేంచెయ్యను? నావుద్దేశ్యమది కాదని యెట్లాచెప్పను? ఆమెమీద నాకు చాలా గౌరవం. అదిగాక ఏమాత్రం మాట్లాడినా, వాళ్ళి దరూ వింటారు. అమర్నాదూ అత్త ఆ గదిలోనే పడుకుంది. ఈసారి నన్ను లేపి తన పక్కమీదికి తీసుకు వెళ్ళింది.

"ఎవరితోనన్నా యీ వ్యవహారమంతా, ఈ నాబాధనంతా చెప్పుకో వాలని యీ వార్త విన్నప్పణ్ణించి అనుకుంటూ. ఎవరితో చెప్పినా, చెప్పు తీసుకు కొడతారని భయం. మీరేమనుకుంటున్నారో? యేమన్నా అను కోండి తీరా చెప్పేశాను.

"మా అత్తతో చాలా సౌఖ్యపడ్డాను. నాచేతుల్లో నిండిపొయ్యేది. నాభాగ్య మందమే గాని, యెక్కడ గట్టిగా నొక్కితే విరుగుతుందో అనిపించేది. అప్పణ్ణించి అది యెదగనేలేదండి—"

"ఎవరితప్పు?" అన్నాడు రామ్మూర్తి వెంకగా.

"ఇది కన్నది. కన్నాక మళ్ళీ నాకోసం వొస్తే నాకేమి మనస్కరించ లేదు. రోత అనిపించేది. మా అత్త 'అమ్మాయీ బుల్లెమ్మా!' అంటే, నాకు అమ్మాయిలాగే కనిపించింది. ఎంతో ప్రయత్నించాను చాతకాలేదు 'ఇప్పుడు మునపటిమల్లేనే వున్నాగా!' అంది. దాంతో నా పేగులు తరుక్కుపోయి, ఏడ్చాను. అది ప్రేమ అనుకుని, ప్రేమతో నన్ను సమీపించింది. ఆరాత్రంతా అత్తదగ్గిరికి వెళ్ళాం, అని చూస్తున్నాను. భార్యకి దడిశివారం రోజులనుంచి ఆమెని చూడలేను. కొంతసేపుభరించాను. ఇంక ఊపిరాడ్డం దుర్భరమై దాన్ని ఒక్కతోపుతోసి, రెండు తిట్లుతిట్టి బైటికివెళ్ళాను. నాశరీరమంతా మలినమైనట్టు, ఏదో వికారమైన పాపం చేసినట్టు, తోచి, నన్నాగలేక యీడ్చినదానిమీద కోపం పట్టలేక, పాకిక్కి వెళ్ళి,

"ఈసారి నన్ను తాకావా నిన్ను చంపేస్తాను కుళ్ళుముండా! నిన్ను చూస్తేనే డోకు, అని వెళ్ళిపోయినాను. తెల్లారేటప్పటికి చచ్చిపోయింది యీ నదిలోపడి."

# భాష న్నా తెలీదు

నేను కోవ్వూరులో పెద్దబోగీలో యెక్కాను. నిండా ప్రజలున్నారు. కూకోడానికి చోటులేక తలుపు దగ్గరగా కూచున్న ఉత్తర హిందూ స్థానం వాళ్లని మూటలు తీసి జాగా చెయ్యమని సౌజ్ఞ చేశాను. తియ్యడానికి వీల్లేదని ఆపాకు భాషలో గోలచేశారు. నాకు కోప మొచ్చి మూట రెత్తి కిటికీలోంచి పారేస్తానని దడిపించాను. ప్రాణం పోతున్నట్టు అరుస్తో చేతు లడ్డంపెట్టి లేచాడో ముసలివాడు. వాడిపక్కన వున్న పిల్ల కళ్ళు వాడిగోలని చూసి నవ్వుతున్నాయి. నోరుమాత్రం కళ్లతో సంబంధం లేకుండా యేదో అరుస్తోంది. సరదా పుట్టి ఆ మూట నక్కడే పడేసి ఆ స్థలంలో కూలపడ్డాను. తరవాతకూడా నా మొహం మాస్తే ఆ కళ్లు నవ్వుతోనే వున్నాయి. కాని ఆనోరు కోపంగా గొణుగుతోంది. నల్లగారేగి కళ్లమీదా చెంపలమీదా, జీరాడేజుట్టూ, ఆంధ్రదేశములో ఎక్కడా కనపడని పొడుగూ చురుకూ వినముక్కూ' మూర్ఛల్లో మూతలు పడుతున్న కళ్లూ, ఆమె మొహాన్ని చాలా ఆకర్షకంగా చేశాయి. గట్టిగా బిగించిన రొమ్ము, గుండ్రని గట్టితొడలూ, నున్నని బుజాలూ, దుమ్ముకొట్టిన బట్టలు కూడా దాచలేకపోయినాయి. మరీ తేరిపారి చూస్తే పోకిరిగా వుంటుందని తన కాతిమీదనించి యేంచూస్తున్నానా అనీ ముసలాడు అనుమానపడతా డేమోననీ "ట్రైనింగ్" తెరిచి నామనసుని బంధించాలని ప్రయత్నిస్తున్నాను. కాని ఆ నవ్వుతో మాయిద్దరికీ ఏర్పడ్డ రహస్యస్నేహం నా మనసుని తొందరపెడుతోనే వుంది. పట్టుకింద నాబుజం చక్కలిగింత 'ఫీల'యింది. ముసలాడు వాడబ్బులకోసం వెతుకుతున్నాడా అని చప్పున పక్కకి కళ్లువాల్చి చూశాను. బల్లుల లాగు రెండు పల్చనివేళ్లు నా బుజానికీ ఆనుకునేబల్లకీ మధ్య నున్నాయి. మెరిసే రెండుకళ్లు ముఖానెత్తి నన్ను చూసి నవ్వాయి. ఆ వేళ్లకి చెందిన చెయ్యి ముసలివాడి వెనకనించి నావేపు చాచుకుని వుంది. ఇటునించి ఆమెవంక చూశాను. గోదావరీ నీలజలాన్ని కళ్లలో ప్రతిఫలింపచేస్తో, స్వదేశపరత్వ గంభీరత్వస్ఫురణలో మమ్మల్ని

రైలునీ మరచి ఏమెరగనట్టు కూచుంది. మెల్లిగా వేళ్ళు నామెడనీ, నా వీపునీ ప్రేమతో తాకి, నాచేతుల్ని పట్టు వొదిల్చాయి. తిరిగితిరిగి ఒక్క చిరునవ్వుకై ఆమెముఖాన్ని వెతికాను. పైకి తిరిగిన ఆమె పెదవిలో ఒక్క మార్పూ లేదు. ఆమె వేళ్ళని వీపుతో నొక్కాను. మెల్లిగా చేతిని జాచాను, కాని ఆవొడుపూ ఆ నేర్పు మొగాడికి నాకు చాతనవుతుందా? ముసలివాడు చప్పున తిరిగి చూసి ఆమెతో కోపంతో ఏదో ఒక్కమాట అని వూరుకున్నాడు. గోదావరిలో రైలాగగానే మూటలు పట్టుకుని కిందికి దిగి ఆమెని దిగమన్నాడు. ఆమె దిగ నంది. కోపంతో కేక లేశాడు. తన సలంనించి కదలక ఏదో వాదిస్తుంది. ఇట్లా రెండునిమిషాలు గోలపడి మూటలు కిందపారేసి, లోపలి కొచ్చి దాన్ని జుట్టు పట్టుకుని బరబర యీడ్చాడు. ఇద్దరుముగ్గురు సగంసగం అడ్డపడపోయి తమ కెందుకని వూరుకున్నారు. పడుచు దానికోసం పోట్లాడడం అందరికీ యిష్టమే కాని భయమే, సిగ్గే. కిందికి లాగి గుండెలో గుద్ది, మూటలు దానిమీద పడేసి నడిపిస్తున్నాడు. ఒక్క నిమిషంలో మేమూ నలుగురైదుగురం కిందికి దిగాము. తక్కిన వాళ్ళకి తమాషాగా వుందిగావును. కాని నా కాముసలాణ్ణి తన్ని, ఆమెని వొగి లించాలని, అణుచుకున్న కొద్దీ తాపాను లేస్తోంది. నావంక నవ్వినచిరునవ్వు, నాబుజాల్ని తాకించిన మాధుర్యం, నాకోసం నావల్ల ఆమె పడుతున్న బాధ- కాని నేను పోట్లాడితే వీళ్ళందరూ ఏమనుకుంటారు? మధ్య నీ కెందుకంటే ఏం చెప్పను? అదిగాక ఈపిల్లకి మాత్రం ధైర్య ముంటుందా? వాడివేపే పలకదా? ఈమె చూపులు చూస్తే మాత్రం వాణ్ణి ఆక్షణాన కాల్చేట్టో, కత్తితో నరికేట్టో వున్నాయి. రాజమండ్రి స్టేషన్లోదిగి, వెళ్ళిచూశాను యింజనుపక్క పెట్టెలో వున్నారు యిద్దరూను. నన్ను చూసి, ఆదరణగా జాలిగా, ముఖం పెట్టింది, ఏంచెయ్యను? వెనక్కి వొచ్చాను. కాని యిట్లాంటివాడితో ఆమె యెంతబాధ పడుతో వుండాలి దినదినమూ? చెప్పు కునేందుకు, అర్థం చేసుకునేందుకు, తనభాషైనా తెలిసినవాళ్ళు లేక యీ పరదేశంలో వాడు చంపుతూ వుంటే—ఇంకా ఏంచేస్తాడో? యెక్కడికి వెళుతున్నారో? నామీద ఎంత ఆశపెట్టుకుందో? యెంత విశ్వసించిందో? కనుక్కుంటే? వెళ్ళి వాళ్ల పెట్టెలో యెక్కి యెదురుగా నుంచున్నాను.

చప్పున నురుగులుకక్కుతో లేచి మూట లోకి చేత్తో, ఆ పిల్ల జెబ్బ నొక చేత్తో పట్టుకొని దిగాను. పక్కనున్న ఆడవాళ్ల పెట్టెలోకి ఆమెని తోసి, తను యింకో పెట్టెలో యెక్కాడు కదిలేయందాకా నామనసు మనసులో లేదు. ఆ స్టేషన్లో వెళ్ళి ఆమె కెదురుగా ప్లాట్ ఫారంమీద నుంచున్నాను. లోపలిదీపాల వెలుతురింకా బైటికిపడటంలేదు గొలాలమీద చల్లని గాలి వింతగా రైల్ని యిదేమివొస్తువాఅని అనుమానంతో తాకి చూస్తోంది. కిటికీలోంచి జార్చినచెయ్యిని పట్టుకున్నాను. ఆమెవేళ్లు నావేళ్ళపైన బిగుసుకున్నాయి. గంట కొట్టారు. ఆ వేళ్లు వొదలలేను. నాకళ్ళు ఆమె మొహం నించి పొడుగాటిరోడ్డువైపు తిరిగాయి. దయాల ఆవేడివేళ్ళని పట్టుకుని లోకమంతా యెంత దీర్ఘ ప్రయాణం చేస్తేనేం? రైలు కదలుతోంది. కొంచెం నడిచాను ఆగి ఆ చెయ్యిని పట్టుకొనేవున్నాను. రైలు ఆమెని లాగింది. ఆపెట్టెలో ఆమె కాక యింకో ముసలమ్మ మాత్రమే వుంది. నేనూ యెక్కితే నేం? అని చెయ్యిని అట్లానే పట్టుకుని రెండో చేత్తో తలుపు తెరిచాను. అది చూసి ఆమె చప్పున లేచి తలుపుకి అడ్డంగా నుంచుంది, రానీదు. నాప్రాణం చివుక్కుమంది, నేనింకా రైలువెంట నడుస్తున్నాను పోక యెవరో కేక వేస్తున్నారు. చప్పున నాబుజంమీద చెయ్యేసి ఆమె నాపక్కకి దూకింది. అమ్మా, భావ రాకపోవడంవల్ల యెంత ప్రమాదం జరిగింది! నేను తనని దిగమని తలుపు తీశాననుకుంది. ముసలాయనా, మూటలూ, నాట్రంకూ దాంట్లో నాభాగ్య నాగవొత్తులూ, నా యల్. టీ. సర్టిఫికేటూ, నా కాకినాడ ప్రియురాలి వుత్తరాలూ, అన్నీ దూరంగా, యెర్రదీపం ముందు, నన్ను చూచి భయపడ్డట్టు సరిగెత్తుతున్నాయి. నిర్విణ్ణులయి ఆమె మొహంవంక చూస్తో నుంచున్నాను. మాట్లాడక తెల్లబోయి, చిన్నపిల్లవలె నేనేమంటానో అని నావంక చూస్తో నుంచుంది. 'కావలిసే దిగావా?' అనీ, యింకేమో అడగబోయి, నవ్వొచ్చి వూరుకున్నాను. ఆమె ఉద్దేశమేమో! తెలీడ మెట్లా? ఎవరికైనా హిందుస్తానీ తెలుసు నేమో? కాని యీ వ్యవహారం యెవరికి చెప్పుకోను? నేవన్లో మనుషులందరూ వెళ్ళిపోయినారు. మాఆలోచనా సంఘంలో చేరతలిచినట్లు ఒక కుంటికుక్క వొచ్చి తోకాడించి మామొహాలు చూస్తో నుంచుంది.

టిక్కెట్లవాడొచ్చాడు. కాకివాడికి కొన్న టిక్కెట్లతని చేతులో పెట్టాను. ఈమెనడిగాడు, ఏంచెప్పను? ఆమె మాట్లాడకనుంచుంది. తెనుగులో, హిందూస్తానీలో అడిగాడు. మాట్లాడలేదు. నావంక తిరిగాడు. గోలయెందుకని రూపాయ జేబులోనించితీసి చేతులో పెట్టాను. రెండునిమషాలు మాయిద్దరికంకా చూసి వెళ్ళిపోయి, సీసను దగ్గిరగా నుంచుని చూస్తున్నాడు. ఆమె ముఖమే చెప్తోంది మాయిద్దరికీ సజావైన సంబంధం లేదని. మాటున్నా వీలులేని ఆమెని వెంటేసుకునినడిస్తే, ప్రజలందరూ యేమంటారు? ఎక్కడికిపోనూ? ఏం చెయ్యను ? ఎంతకాలమని ? తలెత్తి ఎవరిమొహం చూడ్డానికీ సిగ్గుగా వుంది. కాని ఆమె నాపక్కన ఆ అమాయకంగా విశ్వాసం వూడిపడే కళ్ళతో, గుండ్రని చేతులతో, నల్లని జుట్టుతో, ముందు నే ననుభవిస్తాననుకునే సౌఖ్యాల ఆశలతో నాపక్కని నుంచున్నదనే సంతోషంలో, అన్నీ మరిచిపోయినాను. నాబట్టలూ భార్యసొమ్ములూ, పుస్తకాలూ పోతేనేం ? జేబులో యాభైరూపాయలూ పక్కని యీపిల్లా వుంది. ఇంకేం కావాలి ? యీనాడు అట్లా అనుకోనేమో కాని ఆనాడు అట్లా అనుకోనివాణ్ణే ఐతే, యెంతనిర్భాగ్యుణ్ణి ఐవుండాలి? నాపెట్టెకోసం చామర్లకోట వెళ్ళిగామియ్యాలనుకున్నాను. కాని నేనెక్కడవున్నానో ముసలాడు కనుక్కుంటే. ఏమీ యోచనలేకుండా స్టేషన్ దాటి యెర్రదుమ్ముతో నిండిన రోడ్డంబడి ఆమె వెనకా నేను ముందుగానడిచాము. వూళ్ళోకి వెళ్ళడమంటే భయంగావుంది. ఎవరైనా ఏదోవొకటి అడుగుతారు. ఏం చెప్పను? చిన్న తోటవుంది రోడ్డుప్రక్కన. ఇద్దరమూ అరటిచెట్టు క్రింద కూచున్నాము. చీకటి పడుతోంది. గోరువంకలు యెదురుగా ఆమదంచెట్టుమీద మాట్లాడుకుంటున్నాయి. మాకాళ్ళముందు నీళ్ళ మడుగులో బాతులు రెండు యీదుతున్నాయి. మానెత్తిమీద బృహస్పతి వుదయించాడు. నేనామె భుజంమీద చెయ్యేసి ముఖమెత్తి తడి పెదవుల్ని ముద్దుపెట్టుకున్నాను. లేచాము. బాగా చీకటయింది. దూరంగా కనపడుతున్న దీపాలవేపు నడిచాము. దోవలో మళ్ళా ఆమెను దగ్గిరగా లాక్కుని పక్కగా వొత్తుకున్నాను. జీవితమంతో ఆనందంగా కనపడ్డది. తిండిలేక పోతేనేం, యిల్లులేకపోతేనేం, ఆ యెండాకాలపు పైకు గాలిలో నక్షత్రాల

క్రింద ఏ గడ్డిలో పడుకుంటేనేం ? ఆమె జుట్టు నాచేతులమీద జీరాడుతో, ఆమె మెత్తని చల్లనిశరీరం నా కానుకుని పడుకుంటే నాకేం కావాలి ? దీపాలదగ్గిరగా వొచ్చాము. అది బోట్లరేవు. యీ బోటులో యెక్కి వెడితే, యెక్కడికైతేనేం ? అయిదునిమిషాల్లో గది మాట్లాడి ఆమెని లోపలకెక్కించాను. మిటాయీ, పళ్ళూ, కొనితిన్నాము. చీకట్లో గదిలో ఆమెపక్కన కూచున్నాను. మాట్లాడకండా కూచుంది. ఆమె నన్ను పలకరించాలని యెదురుచూశాను ఆమె కదలలేదు. నాకోసం రైలులో అంత ఆగుర్దాపడ్డమనిషి యిట్లా కూచుందేం ? దిగులుగా వుందా ? ఆకలేస్తుందా ? ఏవూరు ? ఆ ముసలా డెవరు ? అని అడగాలని వుంది. కాని యెట్లా ? ఆమెకి నిజంగా నామీద మనసుందనీ, పోనీ, నాపైనే తను యిప్పుడు ఆధారపడి వున్నదనీ, ఆమెకి తెలియచేసేట్టు చెయ్యాలని వుద్దేశ్యపడ్డాను. కిందికి ఒరుగుతున్నట్టుగా జరిగాను, మాట్లాడలేదు. దిగి యిటూ అటూ వెతుకుతున్నట్టు తిరిగాను. చప్పుడులేదు. లోపలికి చప్పునవెళ్ళి విప్పినకోటు వేసుకుని బైలుదేరి, ఆమె వంక చూశాను. వేలన్నా కదిలించలేదు. నా కంతో కోపం వొచ్చింది, అరగంటసేపెక్కడో కూచున్నాను. పడవబాకా వూదారు. లోపల వొచ్చి కూచున్నాను. ఆమె తలన్నా యెత్తలేదు. రైల్లోపోయిన నాగోతులకి, 'షా' పుస్తకాలకీ దిగులుదయించింది. మొహం నీళ్ళుకేసి తిప్పేసి, ఆమెతో నాకేం సంబంధం లేనట్టు తీవిగా సిగరెట్ కాలుస్తో, కూచున్నాను. పడవ కదిలింది. ఇంక తాళలేక, నేనా అమ్మాయికేసి జరిగి చెంపకింద చెయ్యేసి మొహం తిప్పుకున్నాను. వేడిగా నీళ్ళు నావేళ్ళకి తగిలాయి. పాపం ముక్కూ మొహమూ యెరుగని నాతో సాహసంచేసి వచ్చేసిన యీమెకు, యెంత భయపడుతోందో ? భాషన్నా నాకు అర్థం కాదు గద ! నే నేం చేసినా పడవలసిందే కద ! ఇంక నాకంటే దిక్కులేక, నన్నే నమ్మిన యీ అబలపైన నామీద మోహం చూపలేదని నిష్కారణ ద్వేషాన్ని పూని, యిట్లా భయపెట్టి బాధించానుకదా, అని చాలా విచారం కలిగింది. ఆమె తలను గట్టిగా నాకదుముకుని "యెందుకు దుఃఖం, నా పిచ్చిపిల్లా ! నిన్ను వొదిలాననుకున్నావా ? నిన్ను వొదిలేస్తానా ? నే మన్నానుగా ? యీ కంతంలో

ప్రాణమున్నవాళ్ళు నన్ను వొదులుతావా ? ఎందుకు విచారం యిట్లారా" అన్నాను.

యేమనుకుందో ఆ మాటలకి అర్థం; మొహం నాకు వొదిలేసి, ప్రతిమ లాగు కూచుంది. ఏమేమో మాట్లాడించాను. నాకు తెలిసిన రెండు హిందూస్తానీముక్కలూ, "ఆవ్, జావ్, ఖానా కాయా ? కోన్‌బసీ" ఇవికూడా పలికాను. అట్లానే కూచుంది. మళ్ళీ ఏవో ఆలోచనల్లో పడి నల్లని గట్లకేసి వాటిల్లో మెరిసే మిణుగురు పురుగులకేసి చూస్తో కూచున్నాను. ఏదో లాకులవద్ద పడవ ఆగింది. రాత్రి యిట్లానే గడుస్తోందే ? నా పైని యెంతో మోహం చూపవలసిన యీ పిల్ల మూటలాగు మూల కూచునివుండే ? నిద్రన్నాపోదు. ఇంత త్యాగమూ వృధా కావలసిందేనా? నిద్రరాదు. ఆ మోహంవేపే గాలిలో పడవ సాగగానే ఆమెదగ్గరికి వెళ్ళి చాలా చనువుగా కౌగలించుకున్నాను. మెల్లిగా నా మొహాన్ని నెట్టేసి, తల తిప్పుకుని కూచుంది. ఎంత కంత సిగ్గు ! మళ్ళీమళ్ళీ సమీపించాను. రెండు నిమిషాలు వోర్చుకొని తరువాత నిరాకరిస్తుంది. మొదట్లో ఆ అభ్యంతరం కూడా ఆకర్షకంగానే వుంది. వుత్తబిడియం. మొగాణ్ణి నేను చొరవచెయ్యకపోతే యెట్లా ? వెళ్ళి కామంతో మోటుసరసం ప్రారంభించాను. స్త్రీని ప్రేరేపించేందుకు వాత్స్యాయను దేమన్నాడా అని యోచించాను. నన్ను వొదుల్చుకొని గదిబైటికి వెళ్ళింది. ఏమి అవసరమోనని కూచున్నాను. ఎంతసేపటికీరాదు. వెళ్ళిచూస్తే టాపుమీద యెవరో కాపు ఆడవాళ్ళ దగ్గరగా కూచుని వుంది. ఎట్లా తీసుకురాను లోపలికి? యేమని పిలవను? వెళ్ళి దగ్గిరగా కూచుని వాళ్ళు చూడకుండా చెయ్యిపట్టుకు లాగాను. కాని ఇంకా వాళ్ళదగ్గిరగా జరిగింది. వాళ్ళు నవ్వుకున్నట్టు తోచింది నాకు. అధికకోపంతో వొచ్చి గదిలో కూచున్నాను. దాన్ని కాలవలో తొయ్యాలనిపించింది. కృతఘ్నురాలు ! ఐనా నా చేతుల్లోంచి యెక్కడికి పోతుంది లే ! కాని ఆ రాత్రి వృధాగా గడపవలసిందేనా ? నా ట్రంకు పోగొట్టుకున్నదీ, కాన్ఫరెన్సుకి వెళ్ళడం మానేసిందీ, ఇందుకేనా ? డబ్బుతీసుకుని, వాగ్దత్తంచేసి, మోసంచేసి• నిరాకరించే భోగందానిమీదవలె ఆగ్రహం కలిగింది దానిమీద, దీన్నేంచేస్తే యేం తప్పు ? అనుకుంటో ఆకోపం

లోనే నిద్రపోయి, ఎప్పుడో వులికిపడి లేచాను. నల్లులు కుడుతున్నాయి. సుఖంగా లక్ష్మణరావుతోనూ, అతని చెల్లెలితోనూ, మన సుబ్బారావుతోనూ, 'కాన్ఫరెన్సు'లో తిరుగుతో, రామవిలాస్ నాటకాలుచూస్తో వుండవలసినవాణ్ణి, ఇట్లా యీ చెక్కలమీద, వొంటరిగా పడి రాజమండ్రివేపు పోతో వుండేగతిపట్టింది కద! ఇంతమూర్ఖుణ్ణెట్లా ఐనాను? ఈ పరిదేశీకన్యనెట్లా నమ్మాను? స్త్రీలమీద కోపంతో పురాణాల్లో రాసిన సంగతులన్నీ జ్ఞాపకానికి వొచ్చాయి. కాని ఆ అమ్మాయి రైల్లో యెంత ప్రేమచూపింది! నన్ను నమ్మి, ఆ ముసలివాణ్ణి వొదిలి—యిప్పుడే ఆమె నాప్రక్కన పడుకుని వుంటే—ఇరవై కాన్ఫరెన్సులూ, ఇరవై సుబ్బారావులూ, ముప్పై స్నానం నరసింహారావులూ, యెందుకు ఆ అనుభవం ముందు? నే ననుభవించ గలిగి వుండే ఆనందమంతా స్ఫురణకువొచ్చి కోపమొచ్చింది! నన్నుచూసి నాకే జాలి వేసింది! నన్ను కోరివచ్చిన పిల్లని పోగొట్టుకున్న నిర్భాగ్యుణ్ణి. ఆ ముసలాడి మాత్రం చెయ్యలేకపోయినాను. వాడట్లా జుట్టుపట్టుకుని యీడ్చి గుద్దితే బాగావుండేది! నే నింత గౌరవంచేసి కోరితే టెక్కు చేస్తోంది. ఇట్లాకాదు వీళ్ళని సాధించేమార్గం దౌర్జన్యమే! బైటికి వెళ్ళి టాపుపైకి చూశాను. స్త్రీలందరూ నిద్రపోతున్నారు. ఆమె మాత్రం మేలుకుని కూచుంది. దగ్గిరకి వెళ్ళి చెయ్యిపట్టుకుని మెల్లిగా లాగాను. వెనక్కిలాక్కుంది. నడుంచుట్టూ చేతులు వేసి గారాబంచేసి రమ్మన్నాను. వెనక్కి జరిగింది. నాకు చాలా కోపమొచ్చింది. ఇంత ఇష్టంలేంది నన్నెందుకంత మోసపుచ్చాలి? చప్పున జుట్టుపట్టుకుని కిందికి లాగాను. చెక్కమీదికి జారింది. మెడపట్టుకుని ఒక్కతోపు తోశాను. మోకాళ్ళమీద పడ్డది. వ్యవధానమివ్వక వెంటనే లోపలికి తోశాను. తెప్పరిల్లడానికీ, అరవడానికీ వ్యవధిలేక గదిలో చెక్కలమీద పక్కగా పడ్డది. వెంటనే వెళ్ళి వెల్లకిలా తిప్పి చంకలదగ్గిర చేతులు అదిమి మోహంతో ఆమెను సమీపించాను. చేతులతో బలంగాతోసింది నన్ను. అభ్యంతరమేమో కనుక్కునే వీలులేదు. ఏంచెయ్యను? ఈ పెంకితనానికి, అన్యాయానికి కోపం హెచ్చవుతోంది నాకు. నా బలమంతా వుపయోగించి, ఆమెచేతుల్ని విరిచి, ఆమెను ఆక్రమించుకున్నాను. కాని బలమైన ఆ చేతులు నాకౌగిట్లోన స్వాధీనమౌతాయా? ఆ చీకట్లో ఇంక నా ఇష్టమాయె

నేనూ భీమకీచకులవలె మల్లయుద్ధం మొదలుపెట్టాము. ఆ మెదిరో బలబలం, పరిఅన్నంగాణ్ని యెంత మొగాణ్నైనా కేమాత్రం గెలవగలనా ? ఏం చెయ్యలేక కోపం మొచ్చి, తలకాయి చెక్కుల్ని వేసి కొట్టాను. నాచేతుల్ని తన చేతుల్లో ఒడిసి పట్టుకుని, ఇంకా యేంచేస్తావని చూస్తోంది, కళ్ళమీద పడ్డ జుట్టులోంచి. చప్పున చేతులు వొదుల్చుకుని మళ్ళీ కలియపడ్డాను. వొంగ రుస్తో, మధ్య మధ్య మెల్లిగా యేమో అంటోంది తన భాషలో! తిట్లేమో అని నాకు నిగ్గేసింది. మీద కూచున్న నన్ను తోసేసి లేవబోయింది. ఇంక నాకు కోపం ఆగదని తోచిందినాకు. ఇంక అన్యాయయుద్ధం ప్రారంభించాను. ఇష్టమొచ్చిన బూతులన్నీ నోటినిండా తిట్టుకున్నాను. ఆ పడవచెక్కలన్నీ విరిగేటట్టు వూగాయి. యూమై తెగెం నల్లులన్నీ చచ్చివుంటాయి. కింద అసహాయంగా పడివున్న ఆమెని జుట్టంతా పీకాను. బుజాలూ, చెంపలూ, రొమ్ము కొరికాను, గోళ్ళు గుచ్చాను. రవిక ఒక్కవూపుతో చించి ఆ వక్షాన్ని చూసి జయభేరి మోగించి నవ్వాను. నేను చేసిన గాట్లరక్తం నానోట్లోనే చిమ్మింది. అరవదు, మాట్లాడదు వూరికే పెనుగుతుంది. ఆ మొద్దుభాషలో యేమిటో అడుగుతుంది. వివస్త్రఐన ఆమెని చూడగానే, నిగనిగలాడే ఆమె తొడలూ, అంటుకునివున్న ఆమె నడుమూ, చూడగానే నాకు మళ్ళీ కోపంపోయి కామ మెక్కువయింది. మళ్ళీ చివర సారి గట్టిగా ప్రయత్నించి, మెలికవేసి బిగబట్టిన ఆమెచేతుల్ని కాని, కాళ్లని గాని కదిలించలేక యెంత ప్రయత్నించినా వుండవలె ఆమె అంతా దొగ్లడం చేత నిరాశపుట్టి నిస్సహాయుణ్ణయి మాస్తోకూచున్నాను. నావుద్ధతం తగ్గి పశువువలె ప్రవర్తించిన నా క్రూరత్వానికీ, లజ్జాహీనత్వానికి నేను సిగ్గుపడి, ఆమెకి మొహం చూపలేక బైటికివచ్చాను. కాని ఆమెమీద కోపం పోలేదు. తలుచుకున్నప్పుడల్లా నాకు మండిపోతోంది ఇంతలో ఆమె నాకేంపోయింది ? అనే భావం వదలదు. పడవఆగింది. దూకేసి వెళ్ళిపోయినాను వూళ్ళోకి. వూరిపేరన్నా యెవర్నీ అడగలేదు. ఆమె ? ఆమె యేమయిందో! రవికా, చీరా, లేదంటావా ? నే నేం చెయ్యను ?

# మచ్చలు

పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు భవానీరావు 'డ్యూటీ'మీద వెడతోవుంటే, నేనూ వెళ్ళాను. బ్రాహ్మణ వీధులలో చిన్న పురాతనపు పెంకుటిల్లది. దాని ముందు పెద్ద గుంపు పోగయింది. పోలీసుజవాను అడ్డంనుంచుని ఎవర్నీ లోపలికి పోనివ్వటంలేదు. మేమిద్దరమూ నడవాలోంచి లోపలికి వెళ్ళాము. కిటికీకింద మూలనున్న పెద్ద నవారుమంచంమీద ఆపిల్ల శవం పడివుంది. మాసిపోయిన వంగాయిచీరా, నల్లనిరవికా రక్తంతో తడిసివున్నాయి. మెడకింద వాడు పళ్ళతో చీల్చిన గాయం కనపడుతోంది. ఎదిగిన వాళ్ళెవరిలో అంతి చిన్నపిల్లను నేనెన్నడూ చూడలేదు. ఆ అమాయకమూ, విశ్వాసమూ, ఆశ్చర్యమూ, కళ్లు మూతలుపడివున్న, ఆ చిన్న పెదవి వొంపులో, ఆ గడ్డం కొనలో, ఆ కనుబొమ్మలు కలుసుకోడంలో నాకు కనపడ్డాయి. నిద్రలో భయమేసి యేడుస్తున్నట్టే ముద్దుగా జాలిగావుంది. భవానీరావు నోట్సు తీసుకుంటున్నాడు. నన్ను బాధించే జాలిని భరించలేక బైటికి వెళ్ళాను.

అరుగుమీద కూచున్న ఒక కుర్రాడి చూపు నన్నతనివేపు కనిపెట్టి చూసేట్టు చేసింది. అతని మొహంలో విచారమూ, నిరాశా, ద్వేషమూ చెప్పలేనంత గాఢంగా కనబడుతున్నాయి.

"ఎవరు నువ్వు?"

నామాట నిర్లక్ష్యంచేసి

"వాణ్ణేం చేస్తారండీ?" అన్నాడు.

నడవాలో కూచున్న కైదీవంక చూశాను. అక్కడ జరిగే వ్యవహారమంతా తనకేమీ సంబంధం లేనట్టూ, తనేదో తన తపస్సులోనో యోగంలోనో వున్నట్టు కూచుని వున్నాడు.

"మీరు పోలీసులేగావును. అందుకని అడిగాను. అయినా వాణ్ణేం చేస్తేమాత్రం మీకేం పట్టింది. మీపని మీరు చేసుకు వెడతారు".

అని వూరుకున్నాడు. అతని మాటల్లో బాధా అణుచుకుంటున్నట్టు వంటిమహావిచారమూ, చూసి ఆశ్చర్యపోతో నుంచున్నాను. మళ్ళీ అతను—

"వాణ్ణేదో చేస్తారు తప్పదు. ఉరి తీస్తారేమో! కాని వాణ్ణిప్పుడేం చేసి ఏంలాభం? పోయినప్రాణం, మధురమైనదీ, అమాయకమైనదీ. ఆ ప్రాణం తిరిగిరాదుకదా, ఆమె మళ్ళీ మెల్లిగా, దీనంగా, నడుస్తో, బెదిరిబెదిరి చూస్తో, ఇంక కనపడదుకదా? ఎవరన్నా ఒకరు దయగలవారు తనకోసం అనుకంపపడేవాళ్లు ఈ లోకంలో వున్నారా అని వెతికివెతికి, కనపడక, నిరాశపడి, పరలోకాన్ని వెదకబోయింది. ఇప్పుడు అంతా మిగిలిపోయిం తరవాత, అందరూ కనికరం చూపేవారే!

"అన్యాయం జరిగిందనేవాళ్ళే! కాని ఆరేళ్ళనించి వాళ్ల కళ్లముందే యీ హత్య జరుగుతో వుంటే, వొక్కడూ—వొక్క ఆడది—ఒక్క దయ గలమాట మాట్లాడినవాళ్లు లేరు. శవంమీదవున్న కరుణ వీళ్ళకి మనుషుల మీద వుండదు. మీరందరు ఇప్పుడు—హత్య జరిగింతరవాత వొస్తారు, ఘనుల మని—ఏం చేస్తోందో యీ పోలీసు సిబ్బంది అంతా ఇన్ని రోజులూ! బతికి వున్నప్పుడు కాపాడేందుకు ఒక్కరూ కనపడరు. శవంచుట్టూ రాబందుల్లాగు వాలారయ్యా! ఇదంతా వాణ్ణి వురితీసేందుకు, ఈ అట్టహాసం! ఏం లాభం? ఏంన్యాయం? ఆ పిచ్చివాణ్ణి చంపి? వాడికేం తెలుసు?" అన్నాడు.

"వాడికి పిచ్చా?"

"పిచ్చా! ఏమో! నాకు తెలీదు. మీ డాక్టర్నడగండి" నేనింకా అడగబోతుండగా, చివాలునలేచి గుంపువెనక్కిపోయి మాయమైనాడు.

ఆవాళ సాయంత్రం కాలవవొడ్డున చాలాదూరం షికారువెళ్ళి ఇంటికి తిరిగివస్తున్నాను. ఆకలివేస్తోంది. వంటయి సిద్ధంగానే వుంటుంది. గాని, ఇల్లుచేరగానే మెతుకులురావు. కాళ్ళు కడుక్కొని, మడిపంచెకట్టి, సంధ్య వార్చినట్టు నటిస్తేగాని, మా అత్త అన్నంగిన్నె చాచకుపోదు. నా అదృష్టం కొద్దీ, ఏ మేనమామో సవితితల్లి మరదితమ్ముడో నామీద ప్రేమచాత వొచ్చి మడిగట్టి ముక్కుమూశాడంటే, పదిగంటలకన్నా తిండి దొరికినట్టే. అదేమి ప్రారబ్ధమో మాయింటికి వొచ్చిన అతిథులందరికీ, మొదట ఆచారమూ, భక్తి, అధికమౌతాయి. రెండోది ఆకలి మందగిస్తుంది. కాని భోజన తత్పూర్వమే అమందం, భోజన ప్రారంభములోనే అమందం మాయమై, చప్పున మొదట

ఆజ్యధారతో నే జఠరాగ్ని భగ్గుమని, సమస్త పదార్థాలనీ ఆహుతిచేస్తుంది, నాకు మారు వడ్డనకి న్నా మిగలకుండా.

తిరిగి చంద్రకాంత స్తంభంతో తడిసిన వాకిలికి తిలాగు పడమట వాలుతోంది. గాలి గవ్వన పాలసన్నటిలోంచీ దూసుకుపోతోంది. కాలవ కిందో వొడ్డున శ్మశానంలో శవం కాలిపోతోంది. ఎగరకొట్టే ఆగాలిలో నాలికల వలె యెర్రని జ్వాలలు గాలిమీరగనించిలేచి పక్కనున్న నలుగురు మనుషులని కూడా అందుకోవాలని చూస్తున్నాయి. ఆపిల్ల శవమే అయివుంటుంది. పొద్దున్న నేను చూసిన ముడతలులేని ఆచిన్ననుదురూ ఎడస్తున్న ఆపసిబిడ్డ నోరూ యింక లోకంలో యెవరికీ ఎన్నటికీ కనపడవు. అంత అందంగా హృదయాన్ని కరగించేటు లంటిమోమును, ముద్దనాన్ని అందన్నికల్పించి యిట్లా నిర్లక్ష్యంగా నాశనం చెయ్యడంలో యీ సృష్టి వుద్దేశ్య మేమిటో? లోకాన్ని మిరుమిట్లు గొలిపిన సౌందర్యవతులు అహల్య ట్రాయిహెలన్, క్లియోపాత్రా ద్రౌపతి, నూర్జహాన్, వీళ్ళందరి సౌందర్యమూ, ఇట్లాగే కాలి పోయింది, చీకిపోయింది, మన్నూ బూడిదా అయింది. ఎందుకో ఇట్లా! ఈశ్వరుడే సుందరుడూ, ఆనందమయుడూ ఐతే, లోకమంతా యిన్ని వికార రూపాలెందుకో, రూపాలేకాదు—మనసులు. ఆత్మలూ—అన్నీ ఇంతే—ఎక్కడో ఒక్క సుందరమైన ముఖమూ—దృష్టి, హృదయమూ వుంటే, అవి ఇట్లా నలిగి, విరిగి, నాశనమౌతాయి. నాగుండెల్లో చెప్పలేనిదిగులు ప్రారంభించింది.

కాలవ పక్క కూచున్నాడు ఎవడో! ఏడుస్తున్నాడు. ఆగాను, ఆ సన్నని వెన్నెల ఒకవేపూ ఆచితిమీది యెర్రనివెలుగు రెండోవేపు ముఖం మీద పడతోంది. కెరిచూపు. వొళ్ళంతా తడిసింది. వెక్కి వెక్కి యేడుస్తున్నాడు, పొద్దున్నటి కుర్రాడు. నాశనంకూడా ఆవిధంగా తెలపడేకొద్దీ నాకళ్ళయెదట భావించుకుంటున్న నాకు ఆసమయంలో నాదురభిమానమూ, అధికార గర్వమూ, విద్యాధిక్యతా ఎన్నిపోయి, సమస్త జీవరాసులతోటీ సమానత్వం తటస్థించినట్టు తోచింది. ఆ అబ్బాయి దగ్గరికి వెళ్ళి, బుజంమీద చెయ్యేసి—

"తమ్ముడూ! అబాధ్యమేమిటో నాతోటి చెప్పరాదూ?" అని దయగా అడిగాను. వెంటనే హృదయవిహారాలు విడిపోయినట్టు—

"కాలిపోతోంది. పోతూంది కాలిపోతూంది." అని బిగ్గరగా ఏడ్చాడు. అతని చెయ్యి పట్టుకుని దూరంగా నడిపించుకుని తీసి కెళ్ళాను. చంద్రుడస్తమించాడు. నక్కలుకూస్తున్నాయి, కాలవనీళ్లు తూముక్రిందనుంచి 'లబ, లబ' శబ్దం చేస్తూపోతున్నాయి. చీకట్లో భయంతోకీచురాళ్ళు శబ్దంచేస్తున్నాయి.

"సంగతేమిటి? ఆపిల్లనీకు బంధువా? ఇట్లా రహస్యంగా ఎందుకేడుస్తావు?"

అప్పటికి తెల్లవచ్చే విచారాధిక్యత తగ్గింది. కన్నీళ్ళు తుడుచుకుంటూ యీకథచెప్పాడు. నా ఆశల్నీ, భార్యనీ, మెంతినగునీ, కంగిపచ్చదినీ, బంధువుల్నీ వదిలి విన్నాన- ఏరాత్రిదాకానో

"వాళ్ళది బీదకుటుంబం. ఆ పిల్ల ప్రతిదినమూ మా యింటికి మజ్జిగకి వొచ్చేది. నాభార్య ఆమెతో సాధారణంగా సరసాలాడుతో దయగా హేళనచేస్తూవుండేది. నేనూ అక్కడ వుండడం తటస్థించినప్పుడు తమాషాకి మాటలు కలిపి నవ్వేవాణ్ణి. ఆమె చక్కని చిన్నినవ్వునవ్వేది. ఆనవ్వు చూడాలనే సరదాలో, ఏదో వొకటిచెప్పి నవ్విస్తాను. ఒకరోజు ఆమె బుగ్గ మీద పెద్దమచ్చతో మాయింటికి వొచ్చింది. నాభార్య అదేమిటని అడిగితే, సిగ్గుతో మాట తడబడపడి, మంచంకోడు తగిలిందని చెప్పి తప్పించుకోవాలని చూసింది. నాభార్య వొదలక ఏమిటో చెప్పమని ఆ మచ్చనిపట్టుకు పరియాచకాలాడుతోంది. నేను వెళ్లాను.

"దుర్గమ్మా—"

ఆ పిల్లపేరు దుర్గమ్మ.

"దుర్గమ్మా, వారంరోజులకిందట దీనిభుజంమీద ఎర్రనిమచ్చ వొకటి పడ్డది. నీళ్లుపోస్తూ నీళ్ళఅమ్మ అదేమిటే అని అడిగింది కూడాను. అదెట్లా వొచ్చిందో అడుగు" అన్నాను.

నాభార్య "మరీ అట్లానా?" అని పెద్దనవ్వు నవ్వింది. దుర్గమ్మ బుగ్గ మూసి, దుర్గమ్మ వుడుకుకుని, కళ్ళనీళ్ళు కుక్కుకుంటూ, మజ్జిగ తీసుకోకుండానే వెళ్ళిపోయింది.

తరవాత—ఆరోజు అటుల్లద్ది రోజున—నాభార్య ఆ పిల్లని త్రయ్యాల మీద కూచోపెట్టి ధూపిస్తూ నడుందగ్గిర పట్టుకునేటప్పటికి చెప్పిఅని అరిచింది

ఆపిల్ల. రెండుమూడుసార్లు అట్లానే జరిగేటప్పటికి అందరు పిల్లలూచేరి ఏమిటో చూపమన్నారు. ఏమోనా కురుపులనీ, దెబ్బలనీ, చెపితే నమ్మక చీర బలవంతంగా తొలిగించి చూశారు. ఎర్రని పెద్దమచ్చ కనపడ్డదని నాభార్య చెప్పే ఒకటేనవ్వింది.

కొన్నాళ్ళ తరవాత నాలుగురోజులు మజ్జిగకిరాలేదు. ఏమో అనుకున్నాము. భావిదగ్గిర నాభార్యకి తలకి కట్టు కట్టుకుని దుర్గమ్మ కనపడి, పిలిచినా రాకుండా వెళ్ళిపోయింది. రెండు రోజులతరవాత ఆకట్టుతో వొచ్చింది మామూలుగా!

"రావటంలేదేం? దుర్గమ్మా!" అన్నాను.

నవ్వి "కట్లు కట్టుకున్నానుగా!" అంది.

తమాషాకి కట్టు కుందనుకున్నాను.

"మరి విప్పందే వొచ్చావేం?"

"విప్పిందా కావుంటే, మజ్జిగలేక యీలోపున కాకచేసి చస్తామని భయమేసింది, అదిగాక అన్నంలోకి యింకేం గతిలేదు."

"ఆకట్టుతియ్యి"

"అమ్మా! ఆశే!"

"ఏముంది?"

"రత్నాలనీ వొలికిపోవూ?"

"నేను ఏరుకుంటాను."

అని చప్పున కట్టు లాగేశాను. బిత్తరపోయింది ఆమనిషి. రెండు బుగ్గలమీదా, రెండువరసలుపళ్ళు దిగపడ్డ గంట్లున్నాయి. కళ్ళవెంట నీళ్ళు పెట్టుకుంటో కొంగు ముఖంమీద కప్పుకొని దుర్గమ్మ పారిపోయింది. ఆ గాయంచూస్తే నాకు భయం, జాలి, ఆశ్చర్యం, ఇన్నికలిగాయి. పొద్దున్న చూడలా, వాడే రత్తయ్య, ఆమె మొగుడు. వాణ్ణి నేను మొదటినించీ యెరుగుదును. చిన్నప్పుడు వాణ్ణి పిచ్చిరత్తయ్య అనేవాళ్ళం. మూంగి. చిన్నప్పుడు కూడా ఆటలాడడు, నవ్వడు, గంతులెయ్యడు. గుడ్లగూబలాగు చూస్తో కూచుంటాడు. వాణ్ణిచూస్తే అందరికీ అసహ్యాం, ఏదో మురికిగాకనపడేవాడు. పెద్దయినాక మేమెవరం వాడితో మాట్లాడ్డం మానేశాము. వాడూ ఒకరితో

మాట్లాడడు, ఒకరి జోలికిరాడు. పనిచెయ్యడు. అట్లా కూచుంటాడు చుట్ట కాలుస్తో.

వాడి ప్రకారం, ఆ పిట్టలాగుండే దుర్గమ్మను, ఎందుకు బాధించాలా అని ఆలోచించాను. వాడేనా ? వాడు కాక ఇంకెవడు ? దుర్గమ్మవంటి భార్యవుండడం అధికమైన అదృష్టం, అతనికి క్రోధం తెప్పిస్తుందని అను కోడం కూడా పాపకరమైన విషయం. దుర్గమ్మనే అడుగుదా మను కున్నాను. కాని అంతవరకు నాభార్య వెనకనుంచుని పరిహాసాలేగాని, ఎన్నడూ నేనాపిల్లతో సరిగా మాట్లాడలేను. అందుకని నాభార్యనే అడగమన్నాను.

ఒకరోజు దుర్గమ్మ తండ్రి వాళ్ళవూరునించి దుర్గమ్మని చూడ్డానికి వొచ్చి మానాన్నగారి దగ్గరికి వొచ్చాడని తెలిసింది. మానాన్నగారూ మునసబూ, ఆ వూరికి పెద్దా. ఆతన మానాన్నగారితో, తన కూతురికి పుట్టింటికి రావాలని వున్నదనీ, రత్తయ్య పంపడంలేదనీ చెప్పుకుని ఏడ్చాట్ట. తరవాత వారంరోజుల్లో రత్తయ్య పెళ్ళాన్ని కొడుతున్నాడని పుకారు పడ్డది. నాకెందుకో ఆ పిల్లసంగతి మొదటినుంచీ నాస్వంత వ్యవహారంగా కనపడేది. పుకారు ప్రబలమయింది. నాకు దుర్గమ్మ కనపట్టం లేదు. నాకు జాలివేసి ఆపుకారు ఎట్లా వొచ్చిందని విచారిస్తే, రత్తయ్య యింటిపక్కన వున్న నాగన్న పుట్టించాడని తెలిసి వాణ్ణి దబాయించాను. వాడు రుజువు చేస్తానన్నాడు. మర్నాడు తెల్లారకట్ట వొచ్చి, నన్ను లేపి గత్తయ్య ఇంటి పక్కన నుంచో పెట్టాడు. లోపల్నించి జాలిగా మూలుగు వినపడుతోంది. క్రమంగా పెద్దది ఏడుపుగా మారింది. కాని కోపంతో కేకలు లేవు. మళ్ళీ విన్నాను. నేనో విధంగా అర్థంచేసుకున్నాను. పట్టరాని నవ్వు వొచ్చింది నాగయ్య ఏమిటంటాడు.

"ఏమిటా ? అది కొట్టడంరా ? నీ మొహం ? నీకూ పెళ్ళిగానీ ఆ మూలుగు అర్థమౌతుంది. ఇట్లాంటి వెధవపుకార్లు పుట్టించకు. తన్నేను." అని వాణ్ణితో పుతోసి యింటికి వొచ్చి నిద్రపోయినాను. కాని దుర్గమ్మ వొంటిమీద చూసిన గాయాలూ, ఆపిల్ల కళ్ళల్లో చూసిన బాధా నా మన సుని కలవరపెట్టి, ప్రశ్న లడుగుతోనే వున్నాయి.

వారం రోజుల్లో దుర్గమ్మ మా ఇంటికి వొచ్చింది. అన్నాళ్లు ఎందుకు రాలేదంటే జవాబు చెప్పలేదు. అప్పుడు నేనూ నాభార్యా కలిసి అడిగాము. "నిన్ను రత్తయ్య, కొడతాడా ?" అని. కొడుతోవుంటే, వాడు మానేటట్టు చేస్తానన్నాను. ఆమాటలకి చెప్పరాని భయమూ, సిగ్గూ, కలిగి దుర్గమ్మ 'లేదు లేదని, ఏదో వికారంగా అని వూరుకుంది. ఎంత అడిగినా చెప్పలేదు. అటు తరువాత దుర్గమ్మని చూసినప్పుడల్లా నవ్వొచ్చేది, వాళ్ళ దేరి సరసాలూ అంత తీవ్రంగావుంటాయిగావును అనుకున్నాము. "ఏం దుర్గమ్మా! ఎక్కడున్నా కొత్తమచ్చలు!" అని మొదట్లో నాభార్య తరవాత నేనూ అనడం మామూలయింది.

నాభార్య ప్రసవానికని పుట్టింటికి వెళ్ళింది.

ఒక సాయంత్రం మాదొడ్లో దుర్గమ్మ గోంగూరకోసుకుంటూ వుండగా నేనక్కడికి వెళ్ళడం తటస్థించింది. దడిదగ్గిరగా తెల్లవీ పచ్చవీ, చంద్రకాంతపూలు వికసించాయి. ఎండలో వొడిలిన గోగుపూలు సాయంత్రపు గాలిలో ప్రాణాల్ని నింపుకుంటున్నాయి. కొట్టంముందుకట్టిన ఆవులు నన్ను చూసి మెడలుచాస్తున్నాయి. ఉండుండి అంబా అని పిలుపు వినపడుతోంది. రాత్రి కాంతి అప్పుడే భూమి నావరించింది. దుర్గమ్మ వొక్కత్తే గోగుచెట్ల నడుమ, దిగులుగా నుంచుని, ఒక్కొక్క ఆకే వొళ్ళో వేసుకుంటోంది. నా హృదయంలో అపరిమితమైన దిగులు ఆవరించింది. ఆమెదగ్గిరికి వెళ్ళి

"ఏం కొత్తమచ్చలు లేవూ ?" అన్నాను.

సిగ్గుపడక, చిన్న నవ్వుతో "లేవండీ" అంది.

నా మనసులో కొత్తవికారం వుదయించింది. భార్య ఇంట్లో లేకపోవడమే కారణమనుకుంటూ ఇంకా దగ్గిరిగా అడుగువేసి, కొంటెగా, "కొత్తమచ్చలు లేనేలేవా?" అన్నాను మళ్ళీ.

"ఉంటే, కనపడవూ" అంది ధైర్యంగా.

"కనపడనిచోట్ల వున్నాయా?"

కళ్ళూ తలా తిప్పేసింది. ఆ నిముషాన ఆ పిల్లమీద నిష్కారణమైన జాలీ, వున్నతమైన ప్రేమా కలిగాయి. ఆ చూపులో యితరుల సహాయం అడిగే జాలివుంది. నేను చెయ్యగల సహాయం ఒక్కటే కనపడ్డది నాకు.

ఆ సమయాన ప్రేమకీ, కామానికీ, జాలికీ ఎంత సన్నిహితమో! మోకాళ్ల వరకు ఎగదీసికట్టిన ఆమె చీరా, రొమ్మును దాచడానికి శ్రమపడే ఆ రవికా, గాలిలో వూగుతున్న ఆమెజుట్టూ, నన్ను వెళ్లిపోనీక అటంకపెట్టాయి. ఈ గోంగూర ఒక్కొక్క ఆకే కోసి, ఏరి, వొండి, ఆ చీకటి బూజుయింట్లో, ఆమూల, ఆ ముంగి వెధవకి తినిపిస్తుంది. ఒక్క ఆకన్నా మిగల్చక తిని, యీామె వంక తలెత్తి చూడక లేచిపోతాడు వాడు. నా హృదయంలోని ఆ కరుణాభావాన్ని భరించలేక పోయినాను. ఎట్లా సంతోషమివ్వగలను, ఆ శేలహృదయానికి? మచ్చలేవి? చూడనీ" అని ఆమె బుజంమీది రవికను పక్కగా లాగాను. దుర్గమ్మ మెల్లగా నావేళ్ళను తొలగించి మళ్ళీ కప్పుకున్నది. అదే పట్టుదలతో రెండోచేతి పక్కన చూశాను.

అక్కడో పెద్ద మచ్చవుంది. ఇంకా కొంచెం కిందగా యెత్తుగా మొదలు పెట్టేచోట యింకో మచ్చవుంది. "పాపం, దుర్గమ్మా!" అని ఆమె తలని నా రొమ్ముకి అద్దుకున్నాను.

"ఎందుకు నా మచ్చలజోలి నీకు? ఎప్పుడూ నవ్వుతావు? వొళ్లంతా అవే." అని మోకాలి మీద చీరతీసి చూపింది. నేను చప్పున యింకా పైకి లాగి "ఇంకాలేవా?" అన్నాను. తలయెత్తి నావంక తెల్లబోయిచూస్తోనుంచుంది. ఎర్రని పడమటికాంతి ఆమె కళ్లమీద మెరిసింది. నేను ఆమె బుజాన్ని పట్టుకుని వొంచబోయినాను. అప్పుడు కలిగింది జ్ఞానం ఆ అమాయకపు కళ్లలో. భయంతో - వొణుకుతో - ఆ చిన్న మొహం - కాలిపోతున్న ఆ చిన్న మొహం—చెప్పనులేను ఆ బాధ మెడకాయి తెగుతున్న కోడి కళ్ళలోకి వచ్చే చూపు—

"నీకు చెల్లెల్ని, అన్నయ్యా, కొరక్కు—ఆ పని తగదు నీకు. నన్ను కొరక్కు. నీకు ఆ బుద్ధికూడదు నీ కాళ్ళు పట్టుకుంటా, కొరక్కు" అని సన్నగా కీచుమని అరిచింది.

నా మోహం పటాపంచ లయింది. భరించలేని సిగ్గుతో, జాలితో, ఆశ్చర్యంతో వెళ్లిపోయినాను. నామీద, నా కామంమీద, పరమ అసహ్యం కలిగింది. ఆనాటినించి యింతవరకు పరాయి ఆడదాన్ని తాకలేదు. ఆచూపు నన్ను దయ్యంవలె వెంట తరుముతోంది. ఆ కళ్లు, దీనమైన ఆ కళ్ళు—ఎవరి

తోను చెప్పుకోలేని బాధతో కుంగిపోయిన అపాపలు, రక్తధారలు కార్చిన ఆ పాపలు—బొగ్గయిపోతున్నాయి. తనసే కాకుండా, లోకాన్నంతా నాకు చెల్లెళ్ళని చేసింది దుర్గమ్మ. తల్లి కాలి పోతోంది.

ఆలోచించాను, కొరకవొద్దని అరిచిందేమిటి? ప్రేమఅన్నా, లాలన అన్నా, దుర్గమ్మకి కొరకడంతో ప్రారంభమని అభిప్రాయం. వాడూ ఆర త్తయ్య కారణం. వాణ్ణి వెళ్ళి "ఇదేం, రోగంరా!" అని తందామను కున్నాను. కాని నా కెట్లా తెలిసిందని వా డనుమాన పడడా? వాడి భార్యమీద అట్లాంటి కోర్కె పడి, పైగా వాణ్ణి యామని తన్నను? ఏం చెయ్యను? దుర్గమ్మని తెచ్చేసి మాయింటో వుండమంటే, పారిపొమ్మంటే, లేక నేను ఏక్కడన్నా ఆమెని కాపరంపెడితే — ఇట్లాంటి చాలకాని ఆలోచనల్ని చూసి నేనే నవ్వుకున్నాను.

దుర్గమ్మ మాయింటికి ఇంకరాలేదు. ఒక్కసారి ఆమెతో మాట్లాడా లని వుంది. నాభార్య సెలరోజులయిం తరువాత వొచ్చింది పుట్టింటినించి. రాగానే ఆమె చాల కబురంపి పిలిపించాను దుర్గమ్మని.

"దుర్గమ్మా, ర త్తయ్య రాక్షసి. నువ్వా బాధలు పడలేవు. ఎక్కడి కన్నా వెళ్ళు. నేను సహాయం చేస్తాను."

"నేనా? ఎక్కడికన్నా వెళ్ళనా? సంసారం వొదలుకుని! మంచి మాటలు మాట్లాడుతున్నారు. నేనెందుకు వెళ్ళాలి?" అని ఒక్క విసురున వెళ్ళిపోయింది.

నాకు దుర్గమ్మమీద కోపం వచ్చింది. సహాయం చెయ్యబోతే యిదీ! కాని నేను ప్రయత్నించిన దుర్మార్గమూ, ఆమె విశ్వాసాన్ని పోగొట్టుకున్న సమాచారమూ చక్కగా మరచి పోయినాను.

ర త్తయ్యమీద వూరంతా పుకార్లుగావున్నాయి. అతనికి పిచ్చెత్తిందంటు న్నారుకొందరు. ఇద్దరు ముగ్గురు యీడొచ్చిన ఆడవాళ్లని వెంబడించి బలవంతంచేసి పట్టుకుని కరవబోతే, దొంగ అనుకుని తన్నారుట. దుర్గమ్మ రెండుసార్లు ఇంటోంచి పారిపోతే వూరివాళ్ళు లాక్కొచ్చి దిగడ్చారు. ఈసంగతులన్నీ వింటున్నా నేను ఐక్యం కలగచేసుకోలేదు. నాకేం? ఆడదిక్కుతీకరించిం తరువాత మళ్ళీ ఆమెకే సుఖం కనుక్కుంటానా? అని అభిమానపడ్డాను.

ఒకరోజు రాత్రి నాపడకగదితలుపు కొట్టారు యెవరో. తెరిచే లోపలికి వొచ్చింది దుర్గమ్మ. నాభార్య పందిరిపట్టె మంచంమీద, చామంతి పూలతో, పట్టు దిండుమీద తల పెట్టుకుని నిద్రపోతోంది. నేను కుర్చీలో పడుకుని, పతివ్రతల కథలు చదువుకుంటున్నాను. కొత్తగాపుట్టిన మా పాప వాడి అమ్మమ్మ యిచ్చిన వుయ్యాలతొట్టెలో పడుకుని, దీపంకేసి చేతులు జాచి వూకొడుతున్నాడు. సాంబ్రాణి వొత్తులు కొనవరకూ వెలుగుతున్నాయి. మాగదినీ, మా సౌభాగ్యాన్నీ గావున చూస్తో నుంచుంది దుర్గమ్మ.

"ఈరాత్రికి, మీ యింటో....ఆ వసారాలో....యెక్కడైనా సరే పడుకోనియ్యండి" అంది కష్టంగా.

కారణం తెలుసుకోవాలనే ప్రబలమైన నాకోర్కెని దిగమింగుకుని,

"దానికేం? పడుకో. మీ ఇంటో వీలులేదా?" అన్నాను. గుడ్ల నీళ్లు కుక్కుకుని మాట్లాడలేదు. వరండాలో మంచం జంపకానావేసి పడుకోమన్నాను. నా వెంటవొచ్చి మంచంమీద కూచుని, వెళ్ళబొయ్యే నా చెయ్యి పట్టుకుని, కళ్లనద్దుకుని వెక్కి వెక్కి యేడ్చింది. కాని ఏమీ మాటాడదు, ఎంత అడిగినా— "నిర్భాగ్యురాలిని. నా సంగతెందుకు—వెళ్ళి పడుకోండి" అంటుంది ఏం చెయ్యను ?

జీవితంలోని దురదృష్టవంతులు, మన పక్కనేవుంటారు, మనలోనే, స్నేహంగా తిరుగుతోవుంటారు. బాధపడుతో గాయాలు పడుతో, మన కళ్ల యెదటనే అకాలమృత్యువువేపు నడుస్తోవుంటారు. మనం గుర్తించం. గుర్తించినా, మన ఆనందంలోంచి తప్పుకుని వాళ్లకోసం చెయ్యిచాచము. చాచినా, సహాయాన్ని తీసుకోరు. సహాయం చెయ్యలేము. నిస్సహాయులము. సహాయం తీసుకోడం వారి చాతకాదు. దౌర్భాగ్యులు, నిస్సహాయులు, విచిత్రమైన లోకం—భయంకరమైన జీవితం—

"నేను కష్టపెట్టి, నలగకొట్టుతలుచుకొన్న వాళ్లకి నువ్వా, ఓరి అల్పుడా, నువ్వా, సహాయం చేసేది! కానీ!" అని మొహాన నవ్వి నట్టుంటుంది, యెవరో రాక్షసి!

తెల్లవారి నేను లేచేముందే వెళ్ళిపోయింది.

రెండురోజుల తరవాత ఒకనాటి మధ్యాహ్నం, నేను వసారాలో పడుకుని అబ్బాయిని గిలిగింతలు పెట్టి నవ్విస్తూ వుండగా, దుర్గమ్మవొచ్చి మంచంప్రక్కన కూచుంది.

"అన్నయ్యా! ఆనాడు నన్నెక్కడికన్నా పొమ్మన్నారే! పోతాను. ఎక్కడికి పోను?"

అన్నానన్నమాటే గాని ఎక్కడికి పంపను?

"మీ అమ్మదగ్గిరికో, అన్నయ్యదగ్గిరికో వెళ్లకూడదా?"

"అయింది. మళ్ళీ లాక్కొచ్చాడు."

మాయింట్లో వుండమనడానికి ధైర్యంలేదు. రత్తయ్య వొచ్చి గోల చేస్తే మానాయన వొప్పుకోడు. నేను మాత్రం అపవాదుపడగలనా?

"ఎక్కడన్నా నేను వుంచుతాను, యీవూళ్ళో."

"బతకనీడు."

ఇంకేం చెయ్యను?

ఆలోచించాను. ఏమీ తోచలేదు. ఎందుకు నన్నిట్లా బాధపెడుతుంది! పోదేమో అనిపించింది. ఆమె బట్టలూ, వొళ్లూ, భరించలేని వాసన వేస్తున్నాయి. నాపిల్లవాడి కెక్కడ పట్టుకుంటుందో ఆమెనించి రోగం.

"పకలే, చూస్తారే, దుర్గమ్మా, వెళ్లు."

కాళ్ళీడ్చుకుంటో వెళ్ళింది. అప్పుడన్నా నాకర్థంకాలేదు ఆమె బాధ బరువు.

తెల్లవారేటప్పటికి చచ్చివుంది. రాత్రంతా ఆమె కేకలు మూలుగులు విన్నవాళ్ళే అంతా, ఒక్కరూ కదల్లేదు. కిటికీలూ, తలుపులూ, చెవులూ, మనసులూ, బిగించుకుని హాయిగా పడుకున్నారు. ఏం జరిగిందో ఎవరికన్నా తెలుస్తుందా? ఎవరు చెపుతారు? వాడా? వాడేమీ చెప్పడు. చెప్పినా అబద్ధాలు. ఆ కాలిపోయిన పెదిమలు యిదివరకు చెప్పలేదు. ఇంక చెప్పవు.

# ఆర్గ్యుమెంటు

'యామయ్యా జడ్జీగారు, నాకు శిక్ష వేసేముందు నేను చెప్పే సంగతులు ఆలోచించుకోండి. నాకు మల్లేనే మీకూ నరములున్నాయి, నామాదిరిదే మీశరీరమూ, రక్తమూ, మాంసమే—ఇనుము కాదు. నాలోనూ అందరిలోనూ వున్న ఆత్మే మీలోనూ ప్రకాశిస్తోంది. ఎంత రాయి చేసుకున్నా హృదయం మీలోనూ కొట్టుకుంటోంది. దోషాన్ని చూచి శిక్షను తయారుచేసి నా మొహాన పారేసే మెషీను కాదుకదా! మీరు వినండి—నేను చెప్పేదంతా విని, న్యాయమనితోస్తే విడిచిపెట్టండి. వొదలిపెట్టడానికి స్వతంత్రం లేదా! యీ ఉద్యోగం మానుకోండి ధైర్యంవుంటే. ధైర్యంలేక నిర్దోషిని శిక్షిస్తారా? కానీండి.

నేను నిర్దోషిని. దోషినని నాతో వాదించి రుజువుచెయ్యి. ఆ ప్లీడరుని వూరుకోమను. వాళ్లకు నిజంతో పనిలేదు, ఫీజుతోతప్ప. నా నేరం నేనే ఒప్పుకుంటున్నాను. సాక్షులతో పనిలేదు, నీకు మెదడువుంది. నాకూ వుంది. ఇద్దరం కలిసి ఆలోచిద్దాము.

అవును, బిడ్డ పుట్టకుండా నేను గర్భం తీసేసుకున్నాను. అదెట్లా నేరమో చెప్పు?

పుస్తకాల్లో తప్పని రాసివుంది అలా తప్పనకు. పుస్తకాలు పురాతనాలు. ఆ వ్రాసినవాళ్లు దుర్మార్గులు. బుద్ధిహీనులు. వాళ్లమాటప్రకారమే నడచుకుంటే, మనకు వేరే మెదళ్లెందుకు? తెలివెందుకు? పుస్తకంలో అక్షరాలకు లొంగిపోతావా? నేను తిరగబడ్డాను—లోబడ్డావా, నువ్వు నాకంటె పిరికివాడివి — స్వతంత్రయోచనలేనివాడివి — దోషివి — నీకేం అర్హత వుంటుంది నన్ను శిక్షించడానికి?

వినుమరి—నేను మొదటచేసింది తప్పంటావా? ఆపనిచేస్తే శిక్షలేదు. మీ పుస్తకాలప్రకారమే ఆ పనే తప్పంటావా. అది నువ్వు చేస్తున్న పనే. భర్తలేనిది చెయ్యడం తప్పంటావా? భర్తవుండి కడుపువచ్చినా, కడుపు తీసుకోడం నేరమేనా? అదిగాక కడుపురాకండా ఏంచేసినా తప్పులేదూ!

వొస్తే మొదటినించీ అంతా తప్పా! కడుపురావడం నాతప్పు కాదుకద! పెళ్లానికి పిల్లలు పుట్టకపోతే అది ఆమెది తప్పుగాచూసే మీరు నాకు కడుపు రావడం తప్పంటారా? గర్భం కలిగిం తరవాత యెందుకు తీసేసుకున్నా వంటారు? నాకు అనేక కారణాలున్నాయి. నన్ను పోషించేవాడు వొదిలే సాడు. ఎట్లా బతకను? నాకింకేమీ కష్టంపని చేసుకుని బతికడమూచేతకాదు. కూలిచేసుకోరాదా? వంటచేసుకోరాదా? అని సులభంగా అంటారు. అంద మైన కూలిదాన్నిగాని, వంటదాన్నిగాని బతకనిస్తారా మొగాళ్లు? ఇక్కడ వున్నవాళ్లందరూ అట్లాంటిమహానుభావులే, కోట్లూ, తలగుడ్డలూ పెట్టుకొని కికిలి నవ్వులు దాచుకుంటో మీసాలు మెలేస్తో నావంక అతితీవ్రంగాచూస్తో కూచుంటే సరా? మీసంగతి ఎవరికి తెలీదు? మొగాళ్లు బలవంతంచేస్తే నీ నీతి ఏమయిందంటావు? తమకు లొంబడకపోతే తమ పెళ్లాలతో సాడీలు చెప్పి పనిలోంచి తీసేయిస్తారు. ముందు మొగుళ్ళమీదనే సాడీలుచెప్పితే మొగుళ్ళతో పోట్లాడినా, చివరికి ఆడవాళ్లూ నన్నే పొమ్మంటారు మర్యా దగా! నేనూ బతకాలి, ఎందుకు లొంబడ్డావని అందరూ తిట్టేవాళ్లే! మీభార్యల్ని అట్లా గదుల్లో దాచుకోకండా, కాపీలేకండా, నాకు మల్లే, వీధుల్లో పారెయ్యండి. వితంతువులుకాగానే ఏ బంధువుల ఇళ్లల్లోనో చాకి రీలకి చేర్తారే? అభిమానమున్నదాన్నిగనక ఆ నీచత్వంకన్న ఈ స్వతంత్రమే నయమనుకున్నాను. స్వతంత్రంగా సంపాదించమనండి ఓదమ్మిడీ మీభార్యల్ని తెలుస్తుంది. ఆ కులుకు, ఆ పాతివ్రత్యం అన్నీ యేమవుతాయో! రెండు రోజులు యింట్లోంచి వెళ్ళి బైట బతికి రమ్మందురూ తెలుస్తుంది, సంగతి!

ఆ సంగతి పోనీండి. గర్భంరాగానే ఆయన నన్ను వదిలేశాడు. అక లెక్కువయింది. ఒంటో బాగాలేదు. మందులుకావాలి. ఏంచెయ్యను? మీ గుమ్మాల్లోకివస్తే తరుముతారు. అవునా? పతివ్రతలు మీ భార్యలు గుమ్మాలు కడుక్కుంటారు. మైలపడ్డామని వానీడ తాకినచోటు పాణీళ్లు చల్లి శుద్ధిచేస్తారు,

బిడ్డను కంటాననుకోండి. దాన్ని నువ్వు పెంచుతావయ్యా? పోనీ దానిపోషణకి ఖర్చుయిస్తావా? శరణాలయాలున్నాయి. కాని నీతియుక్తంగా కన్నపిల్లలను తల్లిదండ్రులువస్తే తీసుకుంటారట ఆ శరణాలయాలు పెట్టిన

వాళ్లు. నీతియుతంగా పుట్టారేమో అసలు! వైధవముండకొడుకని అందరూ ఏడిపిస్తే ఎవరు ఓదారుస్తారు? నీపిల్లలతో ఆడుకోనిస్తావా? నన్ను పోషించడమే మా ఆయనకి ఇంతకష్టంగా వుంది. రోజుకు మూడుసార్లు పొమ్మంటాడు. నేనైతే మాడిచస్తాను. వాణ్ణి ఎట్టా చంపుకోను? వాడిబాధ చూడలేక వాణ్ణి ఏ బావిలోనో తోసి నేను దూకాలి. పేపర్లో చదువుతారు. ఒక స్త్రీ పిల్లాణ్ణిచంపి తాను చచ్చిందని. దీనికేం పుట్టిందని తిట్టుకుంటారు. పేపరు మడిచి దీపమార్పి పడుకుంటారు.

మరి ఆ 'లా' ని రూపర్చినవాళ్లు మీరో మీతాతలో నాకు వెలిరాకుండా నాబిడ్డకి అమర్యాదరాకుండా కాపాడతారా? ఆసంగతి మీకేమీ తెలీదు. మీకు తెలిసినదల్లా నన్ను కైదులో పారెయ్యడమే.

అవును నాకు వేరుగతిలేక ఆదిక్కుమాలినపిల్లకి ప్రాణమిచ్చి ఏడిపించడానికి కాఠిన్యత తక్కువై, తల్లినిగనక యీపనిచేశాను. మీ అభ్యంతర మేమిటి?

మొదటిది—ప్రాణంతీశానన్నారు. అది నాలోభాగమా వేరేప్రాణమా? నాలోభాగంఅయితే దాన్ని తీసేసుకుంటే మీకేం. నాకోకురుపులేస్తే కోసేసుకోనా? నాచెయ్యి కోసేసుకుంటా మీకేం? వేరే ప్రాణమా? నాదికాదా? అయితే నాలోపల దాన్నెవరు ప్రవేశించమన్నారు, నా అనుజ్ఞ లేంది? లోపల ప్రవేశించి నన్ను బాధించ మన్నదెవరు? మీ అనుజ్ఞ లేకుండా మీయింటోకి ఎవరన్నావస్తే మీరేంచేస్తారు? అట్లనే నేనూ బైటికి తరిమేశాను. చస్తే నేనేంచెయ్యను? నేను రప్పించానా? లేదు. నాకు బిడ్డపుట్టాలని యేమాత్రమూలేదు. నాలోకివచ్చి నా ఆరోగ్యం, నా సౌందర్యం చెడగొట్టి నామానం తీస్తే బాగానే వుందీ? నేనెందుకు దాన్ని కాపాడాలి? దానికోసమా? అదిపుట్టి ఏం సుఖపడుతుంది! నాకోసమా? నాకేం సుఖముంది? మీకోసమా? అవును మీకోసములాగేవుంది. మీరందరూ దాన్ని తిట్టి వెక్కిరించి మీపతివ్రతల్ని మీపిల్లల పవిత్రపు పుటకల్ని సమర్థించు కునేందుకు.

నాయిష్టంవచ్చినమందు నేను మింగుతాను. దాన్ని చావమన్న దెవరు? మీపొట్టలో పాములుచేరితే అవి చావడానికి బాగానే మందులు తాగుతారే?

గాని కసలు ప్రాణమున్నదని మీకెల్లా తెలుసును? భూమిమీదపడంది ఊపిరన్నా పీలవదు. ప్రాణమున్నదని నీకేంతెలుసు? నువ్వెప్పుడన్నా

కడుపుతో ఉన్నావా? జడ్జీ నీకేం తెలుసు? పుట్టినబిడ్డ తిండిలేక మాడి చస్తే నీప్రాణం సుఖంగావుంటుందా? నీకళ్లు చల్లగా వుంటాయా? మరి ప్రాణం తీసినవాళ్లకి వురిశిక్ష కదా! అది వెయ్యరేం నాకు? అంటే పూర్తిప్రాణం కాదన్నమాట. అరప్రాణం, పావుప్రాణం వుంటుందా? అరఆత్మ, పావుఆత్మ వుంటాయా? నిండుఆత్మలు మీకున్నాయా? వుంటే నన్నెందు కిట్లా యేడిపిస్తారు? మిమ్మల్ని చంపినా తప్పులేదు అయితే!

కోడిగుడ్డుకి ఎన్నోవంతు ప్రాణం? గొట్టెకి వాటికి ఆత్మవుందా లేదా? అట్లాచూస్తావేం? నీకేం తెలుసుననికూచున్నావు నన్ను శిక్షిస్తానంటో—

నాఆరోగ్యం చెడిపోతుందంటారా? కాఫీహోటల్లో చెడతినేవారిని, పనిభార్యలకోసం మందులుతినే ముసలివాళ్లనీ దండించరేం? నలభైయేళ్లకే మూలశంకలూ అతిమూత్రాలూ తెచ్చుకొనే జడ్జీలని దండించరేం? దిక్కుమాలినదాన్ని నేను దొరికానా? నాఆరోగ్యంపోతే ఎవడికేం? నాప్రాణం పోతే ఎవడికేం? దుర్భాగ్యంలోపడి యెట్లాచచ్చిందో నని నన్ను చూసుకు సంతోషంతో కడుపునించుకుంటారు మీభార్యలు.

దీన్ని చంపినందుకు లోకంలో మనుషులు తక్కువవుతారంటారా మీరందరూ? పుణ్యాత్ములు మీరున్నారు చాలదూ. కనకుండా వున్న ప్రతి ఆడదాన్నీ శిక్షించండి, వితంతువుల్నందర్నీ కనిపించండి బలవంతంగా!

మీ జనసంఖ్య పెరగడానికి యింకోజీవాన్ని నన్ను మొయ్యమనడానికి మీరెవరు? సృష్టి సాగదంటారా? నాకేం. నీకు సృష్టిసాగిస్తానని పూచీకత్తు నిచ్చానా? అసలు నన్ను కనవద్దని సంఘం ఆజ్ఞాపించిందిగా. 'లా' కనమంటోంది. కంటే సంఘం, కనకపోతే 'లా' శిక్షిస్తాయి. మరి సంఘమేగా 'లా' ని ఏర్పరచింది.

సృష్టి నాలో యింకోజీవాన్ని పెట్టింది, దాన్ని తీసేసుకునే శక్తిని యిచ్చింది. మధ్య మీకెందుకు?

ఏమంటావు నన్ను వొదులుతావా? నీవుద్యోగంపోతుందని భయమా? నీ వుద్యోగంకోసం నన్ను నిర్దోషిని శిక్షిస్తావా. ఇదేనా నీతి, యిదేనా పుణ్యం, చెప్పు జవాబు?'

# ఒరేయ్ వెంకటచలం

నేను రైలుపెట్టె యెక్కి యెక్కడంతో ఓమూలనించి,

'ఒరేయ్ ?' అని కేక వినపడ్డది.

నన్ను ఒరేయ్ అని పిలిచేవాళ్లిద్దరే వున్నారు లోకంలో. వాళ్ళు నాకు ప్రేమాస్పదులైనందువల్ల సంతోషంతో తలెత్తి చూశాను. నాకేసి పరమానందంతో చూస్తున్నాడు తెలిసినవాడు దొరికాడు కదా అన్నట్టు. ఆయనెవరో నాకు తెలీదు, నన్నేనా అని అనుమానపడుతున్నాను.

'ఇట్లారా, చోటుంది యిక్కడ.' అంటున్నాడు పైగా.

ఇన్నేళ్ళూ నన్ను వదలిన బంధువు డెవరన్నా దూరదేశంలో చూచిన ప్రేమచేత పలకరిస్తున్నాడా యేం ? అనుకుని వెళ్లాను. ఒక ట్రంకుని బల్లమీదనించి తీసి, ఓ గుజరాతీవాణ్ణి మనిషికి కావలసినంత స్థలమే ఆక్రమించుకు నేట్టు తోసి నాకు చోటుచేశాడు.

'అట్లా చూస్తావేం ? నన్నెరుగవూ ?'

రైలెక్కగానే బంధువుకు దొరికిన నా అదృష్టానికి గావును, అందరూ నావంక చూస్తున్నారు. లోకంలోకల్లా నాకు యిబ్బందైన విషయం రైలు పెట్టెలో అందరూ నావంక చూడడం.

ఈయన్ని 'నువ్వు' అనాలో 'మీరు' అనాలో తెలీగు. ఇంత పెద్ద రైల్లో యీపెట్టె నాకు ఎట్లా తటస్థపడ్డది ?

'ఎరక్కేం ?' అన్నా.

'ఐతే నే నెవరు ?'

నామీద అంత నమ్మకం లేకపోతే, నన్ను పిలిచి పక్కన కూచో పెట్టుకోమన్న దెవరు ?—

'ఏం చెయ్యను ?

'మరిచిపోయినాను'

'నిజం చెప్పు'

అసలు యెరగనేనా ?

'తెలీదు'

'ఈ డాబులకేం లే! నువ్వు నన్నెరుక్కోం?'

'ఐతే జ్ఞాపకం రావటంలేదు'

పెట్టెంతా అదిరేట్లు నవ్వాడు.

'నన్నెరగవులే నిన్ను నే నెరుగుదును'

ఎవరో చెప్పు అని ప్రశ్న వేస్తానేమోనని ఆశతో ఆగాడు. నేను కొత్తచెప్పు కాల్ని కరిచినచోట చూసుకుంటున్నాను.

'నువ్వెవరో చెప్పనా?'

చూస్తున్నాను. మతి సరిగావుందా యీయనకి? అని. వొద్దని యెట్లా అనను?

'నువ్వు వెంకటచలం'

'కాదండీ, నేను సూర్యనారాయణని?'

'డాబులు కొయ్యకు. నువ్వు వెంకటచలం.'

'ఏ వెంకటచలం.'

'ఇంకెవడు? కథలు వ్రాసే వెంకటచలం.'

'కాదండి ఆయన్ని నేనెరుగుదును'

'ఈ మాటలకేంలే? నిన్ను నువ్వెరగవా?'

నన్ను ఎగాదిగా చూశాడు.

'ఒరే, ఏమిట్రా ఆకథలూ నువ్వూనూ'

'నాకు తెలీదండి ఆ కథల సంగతి.'

'ఆ సంగతి సరేలే.........జరిగాయే అనుకో జరిగినంత మాత్రాన వ్రాయాలా? తప్పు కాదూ? భోజనంచేశామనుకో, తరవాత సంగతికూడా వ్రాసుకుంటారా?'

'నన్నడుగుతారేమిటి?'

'ఆ సంగతి సరేలే. వ్రాశావనుకో, ఏమంటావు?

'అట్టు సరేలే, వ్రాయవొద్దనలేదు. జరిగినవి వ్రాయడం ఎందుకు'

చూస్తున్నాను ఊరుకోంగాక.

'పాపం, వాళ్ళమనసులు నొచ్చుకుంటాయాలేదా?' అన్నాడు,

నిట్టూర్పు విడిచి.

'ఎవరి మనసులు ?'

'ఆ ఆడపిల్లలవి ?'

'ఏ ఆడపిల్లలవి ?'

విసుక్కున్నాడు.

కొడతాడనుకున్నాను.



'అదేరా. ఏదో నిన్ను నమ్మి వొచ్చారనుకో. వొస్తే ? బట్టబయలు చెయ్యాలా ?'

'ఆడపిల్లలెవరు ? నన్ను యిష్టపడి రావడమేమిటి ?'

అంత అదృష్టమా అనుకున్నాను, స్వగతంలో

'తెలుసులేరా ? ఇంక అల్లాంటిపనులు మానుకో' అని.

ఆలోచనగా. 'నీలో యేంచూసి వొచ్చారో ?' అనుకున్నాడు నన్ను బాగా పరిశీలిస్తో.

'ఎవరూరాలేదు. రారు.'

'మరి వొప్పుకుంటూ వనుకున్నానా ! నాకు తెలుసులేరా ?'

'బాగానే వ్రాశావుగాని, నువ్వు వ్రాసినవి ఒక లెఖ్ఖా జమా ! ఈనాడు అసలు రొమాన్సు అనేదివుందా ! ఒరే, యిప్పుడున్నదల్లా రొమాన్సు కావాలనే ఆశవల్ల పుట్టిన జాడ్యం. అంతేకాని చూడు. ఈ కొత్త ఆడపిల్లలు—ఎవరి వెంటపడుతున్నా రంటావు ?— ఈకొత్త కాలేజి కుర్రాళ్ళ వెంట. కవిత్వాలూ, కథలూ వ్రాసే కుర్రకుంకలవెంట. వోరే ! కథ చివరిదాకా వ్రాసేందుకు కలంపట్టుకునే బలంలేదే, వీళ్ళకి ! కథలు వ్రాసినవాడు కథలోమల్లే చెయ్యగలడేమో యీ వెర్రిగుంటల వుద్దేశ్యం ? పొడుగుజుట్లూ, ఫ్రెంచి మీసాలూ, స్నోలూ, వొల్లెవాట్లూ, యివీ ఈనాటి పురుషలక్షణాలు. చొక్కాకింద వెముకలగుప్పలు, ఏదీ నీచెయ్యి ? చూడు, ఏమూలన్నా, ఓక్క రవ్వ కండ.........'

కుయ్యి మని చెయ్యి లాక్కున్నాను.

'ఏం చేస్తున్నావురా, యిన్నాళ్లూ, తుస్నేళ్లూ ? ఏమిటూ పుస్తకం... షా.........అంతే షా లూ, లారెన్సులూ చదువుతున్నావు. నీ బతుకంతా,

మరి యీ పుస్తకాలతోనే పూరేగు. ఆడపిల్లలెందుకురా నీకు? ఏం చేసుకుంటావురా? వాళ్ళని ఐప్పి చదువుకుంటావా? ఏంచేస్తారు రాత్రంతా 'షా' చదువుకుని, స్త్రీలకి స్వతంత్రంలేదని తర్కిస్తారా? ఈ సంఘాన్ని సంస్కారం ఎట్లా చెయ్యాలా, యే కాన్ఫరెన్సులు పెట్టాలా, ఏం లెక్చర్లియ్యాలా అని యోచిస్తారు తెల్లార్లూ—ఒకే పక్కమీద కూచుని' ఓరి జోగుల్లారా? ఎందుకురా స్వతంత్రం మీకు. ఓ మొగుడూ, ఓ పెళ్లాం చాలరా మీబతుకులకి?'

ఆగాడు. చుట్టూ చూశాడు. ఎక్కడికన్నా పోదామని లేవను వొస్తుందేమోనని కిటికీలోంచి నేను చూస్తున్నాను. పోతే తంతానంటే...

'నీ యీడున్నప్పుడు ఇట్లా చూడు, నా జబ్బపట్టి చూడరా'

నాకు మొగవాళ్ళని తాకడం బావుండదు.

ఏంచెయ్యను?

'ఇంకావొత్తు — అంతేనా?'

బిగ్గరగా నవ్వాడు.

'చూశావా? నీ యీడున్నప్పుడూ, పరుగెత్తే దున్నపోతు తోక పట్టుకు వెనక్కి లాగితే, దున్నపోతు ఆగేదిరా. మరి నువ్వు ఎన్నడన్నా దణ్ణాలు తీశావా? చెడుగుడు ఆడావా? మరి ఏంచేస్తున్నావు? ఓ మైలు పరుగెత్తుతావా? పరీక్షలు పాసవుతున్నావు. Love letters వ్రాస్తున్నావు. రోడ్డుమీద ఆడపిల్ల కనపడితే వెంటపడతావు—మరి ఎవరన్నా తన్నవొస్తే పరుగెత్తగలవూ? రాత్రిపూట మూడడుగులగోడ దాటగలవురా? ఇంకేం రోమాన్సురా? నీకు నీ మోహం.'

అది మహారాష్ట్రదేశం గనక తెలుగు తెలీదుగనక సరిపోయింది. తెలుగు తెలుపెట్టిలో అట్లా అరిచి ఆమాట లంటోవుంటే నన్ను!......

'టెన్నిసన్ కవిత్వం, హానిబాల్ శౌర్యమూ, కృష్ణదేవరాయడి బలమూ, కాళిదాసు రఘువంశమూ, మీ శాంతిజి పార్లమెంట్లూ స్వరాజ్యం—జపాన్ వాడితో నువ్వేగా పోట్లాడేది?'

ఆగి చుట్టూచూశాడు. వాల్లెవళ్ళున్నా పోట్లాడగలరేమో, అన్నట్టు.

'ఇంత చాతకాని వాళ్ళు గనకనే కొత్తథియరీలు పెట్టారు —

మాష్టార్నే వున్నానురా, మీ వ్రాతలూ—ఆధ్యాత్మిక ప్రేమలూ, ప్లేటోనిక్ లవ్‌లూ, మానసిక సానుభూతీ, పవిత్రత్వా, కళా వుపాసనా — మీ వ్రాతలట్లా వున్నాయి గనకనే మీ రాత లిట్లా యేడిశాయి—'

'వెంకటచలంగారు వాటిని వొప్పుకోరండి'

'నువ్వు వొప్పుకోవులే. కాని నువ్వుమాత్రం—విన్నావ్రా, ఆ షికార్లూ నవ్వులూ, టీపార్టీ, బోట్లమీదా రైళ్ళమీదా గంతడాలూ.........ఆడపిల్లల్ని రోడ్లపాల తిప్పడమెందుకురా! అలిసిపోవాలనా? అవునులే, అంతకన్న చాతకానప్పుడు ఏం చేస్తావులే?

ఒరే నామాట విని ఆ కథలు మానెయ్యి. ఎందుకురా నీ అనుభవాలూ నువ్వూను. నన్నెరుగుదువుగా!'

'అవన్నీ వూహించి వ్రాసినవండి. ఆయన అనుభవాలు కావు ఆయన్నెరుగుదును నేను'

'సరేలే ఎవరికుందన్నా బొంకుగాని, నా ముందు కాదు' నాకు తెలీనిదేమీలేదు. మహామహావాళ్ళని చూశాను. ఏం తెలుసురా నీకు ప్రేమంటే? నీకేం తెలుసు? నన్నడుగు చెపుతాను. ఎప్పుడన్నా మావూరురా, నేను దాచిన వుత్తరాలు చూపుతాను. ఫొటోలూ వున్నాయిరా? చేసే నా కథలు వ్రాస్తేనా? ఇట్లాంటి ఆడవాళ్లా? ఇంతంత కళ్ళూ, ఇంత జుట్టు, ఇంతంత.........'

వెళ్ళిపోతోంది ప్రవాహం. నుంచున్నాడు. ఆ జుట్టునీ కళ్ళనీ చేత్తోచూపుతో వర్ణిస్తున్నాడు. పెట్టెలోవాళ్ళు తెలుగువాళ్ళు హిందీ ఫిల్ముని చూసినట్టుచూసి ఆనందిస్తున్నారు. ఒకళ్ళిద్దరు లేచి ఆడడానికి సిద్ధమయ్యేట్టున్నారు. 'పాట పాట' అంటారు కొంతసేపు పోతే. ఇదేం ఖర్మం నాకు?

'మరెవరో చెప్పారురాదు?'

'నేనా!' కూచున్నాడు. 'నన్నెరుగవూ?'

'ఎరగను'

'ఎరక్కేం. నేను యౌవ్వనంలోవుండగా ప్రతి పత్రికలోనూ నా

ఫోటో వెయ్యమని యీ పత్రికలవాళ్లని ఆశ్రయించే వాణ్ణా నేనుమళ్లే! వాళ్లే నా గుమ్మంముందు పడివుండేవాళ్ళు, ఏమనుకున్నావో ? విన్నా వుగా ? వ్రజేశ్వరశర్మ నా పేరు ?

'మీరా అండీ! చిన్న కుర్రాణ్ణి నేను, మీరు మా కాలేజీలో డిమాన్‌స్ట్రేషన్ యిచ్చినప్పుడు.........'

నాకు జ్ఞాపకమొచ్చింది, ఆ పటం.

చెయ్యి కదిలిసవా, కాలు కదిల్చినా తాచుపాముల్లాగ పెనవేసుకునే నిగనిగలాడే కండలు చల్లని చర్మంక్రింద వుబ్బి కళ్ళను చెదరగొట్టే బలం......

అంత 'రాట్' ఆయన మాట్లాడినా, నాకు అద్భుతమైన అభిమానం కలిగింది. శరీరబలానికి ప్రజలుయిచ్చే అప్రయత్నమైన గౌరవం.

'ఎరుగుదువుకద! మాకాలంలో నా యీషికార్లూ యీ కవిత్వాలూ ఏమీ లేవు. ఒక్క చూపు, ఒక్కమాట— చాలు—ఈ టీలకు పిలవడాలూ, యీ పేర్లులేని చీట్లూ, యీ పుస్తకాల్లో పర్యాలకీ పెనసలుగీట్లూ, యీ గూఢకవిత్వాలూ, భావగీతాలూ, భావోద్రేక కథలూ, ప్రేయసులూ, హంసలూ, కోకులూ, కోయలలూ,—ఏమీ లేవు. అసలు మా పనేమిటో అది జాగ్రత్తపడేవాళ్ళం. కోయలలూ మందమారుతాలూ వాటి జాగ్రత్త అవి పడేవి. వెతకడాలూ, చుంబనాలూ, మా చాతకావు.

'ఎందుకురా వెధవ చదువులు! పదిగారెలు తినలేని, ఇద్దరు ఆడవాళ్లకి జవాబు చెప్పలేని చదువులు రెందుకురా అవి ? ఆ జాగ్రత్తల బదులు దేశ మంతా తిప్పకూడదూ ? ఆ హిస్టరీ బదులు పాత చాణక్యాలకోసం గోతులు తవ్విస్తే, వృక్షశాస్త్రం బదులు దున్నిస్తే, జంతుశాస్త్రం బదులు గాడిద తొక్కిస్తే, గంటకి రెన్ని దండాలు తియ్యగలరో ఆ లెక్కలు చెపితే బాగుపడతారు మీరు. బైరన్ చదివి, ఎంకిపాటులు పాడి 'షా' ని కోట్ చేసి, కథలురాసి, ఆడపిల్లల్ని మరిగించి, తీరా భార్యని వొస్తే నవ్వులేసే దేమిట్రా! ఒకటిన్నర తులం తాడు బిస్కటు ముక్కా, అరకప్పు టీ యిస్తావా వొయ్యారంగా ? తీరా సమయం వొచ్చేప్పటికి మేమ్మేమ్మే అనడం— లేకపోతే ప్రేమమీద లెక్చరు కొట్టడం, తప్పించుకు పారిపోవడం.

అయితే యింకోటికి ఈ నాటి ఆడపిల్లలూ అట్లాగే వున్నారు. చప్పిదవడలూ, కాలికీ కంటికీ జోడూ, వొంగిన నడుములూ, పొచల టి చేతులూ— ఎందుకురా వాళ్ళూ.........అన్నీ వున్న పిల్ల ఒక్కత్తె కనపడదే, వొద్దివాళ్లల్లో తప్ప! సరిపోయినారులే ఒకరికొకరు!'

'ఇదేనా పోలావురు?'

రైలు వేగం తగ్గించింది. ఆయనలేచి సలుగురిమీద నుంచి పెట్టా పక్కా సద్దుతున్నాడు. మాటలు మాత్రం ఆగలేదు.

'అయినా బొంబాయి యెందుకు నువ్వు? ఆంధ్రదేశంచాలలేదూ? విన్నానులే! ఆ పైనూరుపాకు సంగతి—ఏం?

'ఏమిటది'

'తెలీనట్టు చూడకు. చేసి పైగా దొంగచూపులు పెడతావా? ఆ వెధవవేషమే మంచి కొచ్చేది. మనలో మనకేం? వొప్పుకో కూడదూ అంతిమాత్రం? ఆ కాఫీహోటలువా ళ్ళేమన్నారు? చెప్పు నా, హ హ 'ఆంధ్రదేశం చాలదా, పైనూరుమీద పడ్డాడా?' అన్నారటగా! బలే వాడివి.'

'అదేదో వెంకటంచలంగారేమో నాకు తెలీదు.'

'ఒకే, అబద్దంచెపితే, 'జోక్' కాసేవు. పొద్దు సమానం అదేమాటా? అందుకునే మండుకొస్తుంది యీ కుర్రాళ్ళతో మాట్లాడ్డం? పిరికివెధవలు— నువ్వేదో నయమనుకున్నా, కథల్లో నీ డాబులుచూపి. అందరికన్నా— అన్యాయం నువ్వు. సరేలే, బొంబాయిలో జాగర్త. తన్నులుతినేవు! మొగాళ్ళు కాదు ఆడవాళ్లే ంతారు. ఆంధ్రులకు అపరిచిష్ట లేకు.'

రైలాగింది. సామాన్లు దించుకుంటున్నాడు. చప్పున యేదో జ్ఞాపకం వొచ్చి తలుపు దగ్గిర్నించే 'ఒరేయ్' అన్నాడు.

ఆ అరుపుకి ముగ్గురుపోర్టర్లూ, ఒక గుమాస్తా, రెండు కుంటి కుక్కలూ ఆగాయి ఆ పెట్టె దగ్గిర.

'అయినా ఆ యూరేషియను పిల్లతో నీకేం పనిరా? కంపుటుగా వాళ్లదగ్గిర?'

'నాకేం తెలుసు?'

'ఇంత పిరికి వెధవ్వి అనుకోలేదు. ఎంత మోసపోయినాను!' —

'నే నా వెంకటచలం కాదండీ.'

'కాదూ? ఎవరు నమ్ముతారు?'

మీరు నమ్ముతారా అన్నట్టు బండిలోవాళ్ళనీ ప్లేటుఫారంలో వాళ్ళ వంకా చూశాడు.

బండి సాగింది.

నేను నిట్టూర్పు విడిచి ఆలోచిస్తున్నాను.